
PARLE
POPPINS
Doon Kya?
Ram and Shyam
దెయ్యాల నౌక
భాగం 2
జరిగిన కథ: బ్లాక్‌బెర్డ్ నాయకత్వం వహిస్తున్న సముద్రపు దొంగలు రామ్ మరియు శ్యామ్ క్రూస్ లైనర్‌ని అపహరిస్తారు. అబ్బాయిలు ఓ ప్లాన్ చేసి, డిక్నాట్రిక్స్ కనిపించకుండా చేస్తారు.
తర్వాయి భాగం...


ఈ సముద్రపు దొంగలను
నేను చూసుకుంటా. నువ్వు కెప్టెన్ దగ్గరకు వెళ్ళి,
తర్వాత నా దగ్గరకు రా.
గొచా


కెప్టెన్ డెక్‌లో.....
కెప్టెన్, రామ్ ఇక్కడ.
నేను ఇక్కడ లేనని చెప్పు.
ఇది మా ప్లాన్..... ష్..... ష్.....ష్.


అక్కడేమో శ్యామ్ బిజిగా ఉంటాడు....
హె ఆ పెయింటింగ్
నెమ్మదిగా కదిలింది.
ఏం మాట్లాడుతున్నావు!
అది నీ భ్రమ


రామ్ కూడా శ్యామ్ దగ్గరకు వస్తాడు, వాళ్ళిద్దరు
కలసి సముద్రపు దొంగలను దెయ్యంలా భయపెడ్తారు.
బూ!
ఎవరో నా జుట్టు లాగారు


కుర్చీలు పైకి కిందికి పడతాయి
హె ఎవరో ఆ ప్లేట్స్ కదిలించారు


విచిత్రమైన సంఘటనలు జరుగుతున్నాయి...
ఈ నౌక మీద దెయ్యాలు...
దాడి చేశాయని మీకు
అనిపించడం లేదా
వెదవ మాటలు!
దెయ్యలు అనేవి ఏం ఉండవు!
వెళ్ళి పనిచూసుకోండి


దెయ్యాలు దాడిచేసిన వార్త పాకగానే,
సముద్రపు దొంగలు సముద్రంలో దూకుతారు,
కెప్టెన్ ద్వారా హెచ్చరికచేయబడిన
కోస్ట్‌గార్డ్‌లు వారిని పట్టుకుంటారు.


పిల్లల ద్వారా విడిపించబడ్డ కెప్టెన్
మనుషులు బ్లాక్‌బెర్డ్‌ని పనిపడతారు
ఎంత ధైర్యం మీకు నా మీదే ట్రికా?
ఆఆఅగ్‌గ్‌గ్‌చిచిచ!


మళ్ళీ క్రూస్‌లైనర్‌లో ప్రశాంత
వాతవరణం నెలకొంటుంది.
హాహాహాహా!
ఎంత హాయిగా ఉంది.
ఇక మన సెలవులను
హాయిగా గడపొచ్చు.
POPPINS

PRAKRITI
www.prakritilive.org

## Pledge your support to



# THE GO GREEN! MAGIC




Get your green card and green band and await for the excitement to follow.

---

**Enroll Yourself**

Send your entries along with a photo to Chandamama India Ltd., B-3, Lunic Industries, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093, Phone +91 22 28312872 / 28311849 or E-mail to joingreen@prakritilive.org (attach scanned photo) upto 30/06/2010

NAME : ..................................................

SCHOOL : ..................................................

DOB : ......... /......... /............... Blood Group: ..................... Sex : ..................................

FATHER'S NAME: ..................................................

Address : ..................................................

Phone No. : .................................... Mobile: ....................................

Email : ..................................................

*For Details on GO GREEN! Log on to www.prakritilive.org

సంపుటి: 63 మే 2010 సంచిక: 5

పేరు........................................ వయస్సు .......

చిరునామా..................................................

..................................................................

..................................................................

ఫోన్ :................ ఇ-మెయిల్:.....................................

# మీ మనసులో మాట చెప్పండి!

మీ అభిప్రాయాలను ప్రక్కన కథకు/శీర్షికకు నేరుగా ఉన్న గళ్లలో టిక్ చేసి చుక్కల గీత గుండా కత్తిరించి మీ ఫోటోకాపీలను పోస్టు ద్వారా మాకు పంపండి.

అత్యుత్తమం ఉత్తమం బావుంది ఫరవాలేదు మామూలు

**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B',
MIDC, Andheri (East), Mumbai-400093.

## ఈ సంచికలో ...

చందమామ

# మామిడిపళ్లూ, చందమామా, ఆటలూ!

వేసవి కాలం పొడవునా ఈ మూడు పదాలూ మీకు పదే పదే గట్టిగా వినిపిస్తూనే ఉంటాయి కదూ! పరీక్షలు ముగిశాయి కాబట్టి, రాబోయే వారాల్లో పిల్లల సరదాలు రెక్కలు విప్పుకుని విహరిస్తాయి. ప్రపంచమే స్వర్గధామమైపోతుంది కదూ! పాఠశాల, హోమ్‌వర్క్‌లతో తిరిగి పలకరించే జూన్ మాసం రాకముందే మనం సెలవులన్నీ ఆనందంతో గడిపేద్దామా!

అయితే వేసవికాలం అంటే విరామం, ఆటలు మాత్రమేనా? ఈ రుతువులో దేశవ్యాప్తంగా తీవ్ర ప్రభావం చూపే నీటి ఎద్దడిని మనం మర్చిపోకూడదు. పకృతి సమతుల్యతను కాపాడకుండా విచ్చలవిడిగా అడవులను నరికివేయడం, దాని ఫలితంగా జరిగే పారిశ్రామికీకరణ కారణంగానే ఇలాంటి సమస్యలు వస్తున్నాయి. మరి కొన్ని సంవత్సరాల్లోనే నీటి సమస్య మనందరికీ కలవరం కలిగించబోతోంది.

దీనికిగాను ఇతరుల వైపు వేలు చూపించడంవల్ల ప్రయోజనం లేదు. ప్రకృతి సమతుల్యతను తిరిగి సాధించడంలో మనందరం తలో చేయి వేయాలి. కాలుష్యాన్ని బాగా తగ్గించడానికి, పకృతి వనరులను పరిరక్షించడానికి మనం పూనుకోవాలి. వ్యక్తులుగా కూడా మనం భూమిని కాపాడ వచ్చు. మీ స్నేహితులతో కలిసి మీ ఇరుగు పొరుగు వారిలో చైతన్యం కలిగించేందుకు ప్రయత్నించ గలరా? ఈ దిశగా మీరు చేపట్టే కార్యకలాపాలను మాకూ తెలియజేయండి. ఈ సందేశాన్ని ప్రచారం చేయడంలో మా వంతు కృషి మేము చేయగలం!

మే 1న అంతర్జాతీయ కార్మిక దినం. దీన్ని మేడే అని పిలుస్తున్నారు. కార్మికుల హక్కులు, కార్మికోద్యమ సామాజిక, ఆర్థిక విజయాలతో ముడిపడిన చరిత్రలోని పలు సంఘటలను గుర్తు చేసుకుంటూ ప్రపంచవ్యాప్తంగా మేడే జరుపుకుంటారు. తమ సమస్యలను ప్రపంచానికి చెబుతూ మే డే పండుగ దినాన పలు కార్మిక సంఘాలు ప్రదర్శనలు చేస్తాయి. పౌర సమాజం సరిగా పని చేయాలంటే హక్కులు, బాధ్యతలు రెండూ ముఖ్యమే.

చందమామ ఇటీవల ప్రచురించిన ఆర్ట్‌బుక్, వార్షిక సంచికను మీరు చదివారా? చదివి నట్లయితే, మీ అనుభూతిని మాకు తెలుపండి. ఈ వేసవిలో చందమామతో చల్లగా కాలం గడపండి.

– సంపాదకుడు





మే 2010 Rs. 20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093. Editor : Prashant Mulekar



# పాఠకుల లేఖలు





చందమామతో మాది దశాబ్దాల బంధం. ఫిబ్రవరి, మార్చి నెలల చందమామలు చాలా ఆలస్యంగా అందుకున్నాము. ఇటీవల కాలంలో ఎన్నడూ లేని విధంగా మార్చి సంచికలో 12 కథలు, ధారావాహికలు ప్రచురించారు. నిజంగా సంతోషపడ్డాను. అయితే చందమామ సైజు రానురానూ తగ్గిపోతూండటం బాధ కలిగిస్తోంది. కథల రచయితల పేర్లను కథ మొదటి పుటలోనే కింది బాక్స్‌లో వచ్చేలా చేయగలరు. రచయితలకు అదెంతో గౌరవంగా ఉంటుంది. – గౌరీశంకర్, హైదరాబాద్

1950 నుంచీ చందమామ అభిమానులం. చందమామ కథలకు, రూపకల్పనకు 1950–70 మధ్య సొబగులు తిరిగి కొంతైనా అమరాలని మా కోరిక. వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడంలో, ఆలోచనలను సంస్కరించడంలో, మెదడుకు పదును పెట్టడంలో– చందమామ కథల ప్రాధాన్యం అంతా ఇంతా కాదు. అది స్వానుభవం కూడా. అందువల్ల చందమామకు మేము సర్వదా కృతజ్ఞులం. 1971 నుంచి చందమామకు రచనలు చేస్తున్నామని కాక చందమామలో మా రచనలకు స్థానం లభిస్తున్నదని చెప్పుకుందుకే గర్వపడతాం. – వసుంధర, హైదరాబాద్

ఇన్నేళ్ల అనుభవంతో చెబుతున్నాను. కథల విషయంలో చందమామకు పోటీ లేదు. ఎన్ని కథల పత్రికలు వచ్చినా, వస్తున్నా చందమామకు చందమామే సాటి. బాలసాహిత్యాన్ని బాలలే కాకుండా ఆబాలగోపాలం చదువుకుని ఆనందించే స్థాయికి తీసుకువచ్చిన ఘనత చందమామకే దక్కింది. అందుకే చందమామ బాలసాహిత్య సిరి అని చెప్పవచ్చు. తెలుగు వెలుగుల జయకేతనం చందమామ. అది తరతరాల అందరి మామ.

– ఎంవీవీ సత్యనారాయణ, విశాఖపట్నం

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://Telugu.chandamama.com**

# ఛోటూ ఏమవుతాడు?



ఆడ్ బాల్

kotak® life
A JOINT VENTURE WITH OLD MUTUAL
*Faidey ka insurance*


















మీరే ఛోటూ అనుకుని ఖాళీ స్పీచ్ బబుల్స్‌ని పూరించండి. (ఒక బబుల్‌లో 50 కంటే ఎక్కువ పదాలు నింపవద్దు.)
మీ కెరీర్ ఎంపిక గురించి మీ తల్లిదండ్రులకు మీరు ఎలా నచ్చచెప్పగలరు? మాకు తెలుపండి! ఉత్తమ ఎంట్రీ పంపినవారు రూ.10,000ల బహుమతి గెల్చుకుంటారు*!

Entries must be sent on or before 31st May 2010 with full name, postal address, and telephone number to:
Editor, CHANDAMAMA INDIA LTD., B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093 or email your entries to: contests@chandamama.com.
The winning entry will be published in July 2010.

(బీమా అనేది అభ్యర్థనకు సంబంధించిన విషయం. కొటక్ మహీంద్ర ఓల్డ్ మ్యూచువల్ లైఫ్ ఇన్సూరెన్స్ లిమిటెడ్, రిజిస్ట్రేషన్ నం.107, చిరునామా: 9వ ఫ్లోర్, గోద్రెజ్ కొలీజియం, ఎవెరార్డ్ నగర్ వెనుక, సియోన్ (ఈస్ట్), ముంబయ్ - 400022. KLI/10-11/P-CA/9)

* షరతులు వర్తింపబడతాయి



# దురదృష్టవంతుడు

ఉజ్జయినీ నగర ఆస్థానకవి రఘునాధుడు అఖండ మేధావి, శతాధికంగా కావ్యరచన చేసిన ఉద్దండ పండితుడు, గొప్పకవి. ఆయన కుమారుడు సోమనాధుడు కూడా కవీ, పండితుడూనూ, అతడు కూడా కొన్ని కావ్యాలను రచించాడు. కాని, అవి అంతగా ప్రశంసలు పొందలేదు.

ఒకనాడు సోమనాధుడు,ఉజ్జయిని రాజు వద్దకు వెళ్ళి, ''మహారాజా, తమ అనుజ్ఞ అయితే పొరుగు దేశం వెళ్ళి బతకాలని ఉంది,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయి, ''మీ నాన్నగారు, నిన్ను సరిగా చూడడం లేదా?'' అని ప్రశ్నించాడు.

''ఆ మాట నిజం అంటే నా కళ్ళు పోతాయి'' అన్నాడు సోమనాధుడు.

''నా రాజ్యంలో, నీకు సౌకర్యంగా లేదా?'' అని అడిగాడు రాజు.

''పొరుగు రాజ్యంలో ఇంతకంటే నేను అనుభవించగల భోగం ఉండదు,'' అన్నాడు సోమనాధుడు.

''మరి ఎందుకు పొరుగు రాజ్యం వెళ్ళాలనుకుంటున్నావు?'' అని అడిగాడు రాజు.

ఆ ప్రశ్నకు జవాబివ్వబోయి, సోమనాధుడు చప్పున తల వంచుకోవడం గమనించిన మంత్రి, రాజుతో, ''మహారాజా, ఈ కుర్రవాడికి అనుమతి ఇవ్వండి,'' అని సలహా ఇచ్చాడు.

సోమనాధుడు వెళ్ళిపోయాక రాజు, మంత్రిని, ''ఎందుకలా సలహా ఇచ్చారు?'' అని అడిగాడు.

''నిజమైన దురదృష్టవంతుడు, అసాధారణమైన ప్రజ్ఞ గల తండ్రి గలవాడు,'' అన్నాడు మంత్రి.

పొరుగు రాజ్యంలో సోమనాధుడికి, మహాకవి అన్న ఖ్యాతి త్వరలోనే లభించింది.

*– డా. తాటిచెర గురురామప్రసాద్*





# రోగనిర్ణయం!

వైద్యుడిగా మంచి పేరు పొందిన కృపానందం అనే ఆయన, తన వద్దకు వచ్చిన రోగుల నాడీ వగైరా పరీక్షలు చేసి, ‘‘ఇది చాలా ముఖ్యం! గత నాలుగు రోజులుగా, మీరేం కూరలు తిన్నారో చెప్పండి. ఆ కూరలే మీ అనారోగ్యానికి కారణం అయి ఉండొచ్చు,’’ అనేవాడు.

తరవాత రోగి చెప్పిన కూరల పేర్లు జాగ్రత్తగా విని, ‘‘ఓహో, ఇంకేం, అర్థమైంది! సరే, ఈ మందు వాడండి,’’ అని మందు ఇచ్చి, డబ్బు తీసుకునేవాడు.

ఆయన దగ్గిర వైద్యం నేర్చుకోవాడనికి వచ్చిన రత్నాచారి అనే యువకుడికి ఈ తతంగం అంతుపట్టేది కాదు. తినే కూరలకూ, రోగ నిర్ధారణకు సంబంధం ఏమిటో అతడికి ఎంత తరచి చూసినా అర్థం కాకుండా పోయింది. తన గురువు గారి ధోరణి కొన్నాళ్ళు గమనించి, ఒకనాడు, ‘‘గురుదేవా, వచ్చిన రోగులు గత నాలుగు రోజుల్లో తిన్న కూరల విషయం ప్రశ్నిస్తూంటారు. రోగనిర్ణయానికి అదంత ముఖ్యమా?’’ అని అడిగాడు.

ఆప్రశ్నకు కృపానందం నవ్వి, ‘‘వాళ్లు వండుకున్న కూరలు, వాళ్ల ఆర్థిక స్థోమతను తెలుపుతాయి కదా! దాన్ని బట్టి, వాళ్లనుంచి ఎంత డబ్బు రాబట్టాలో నిర్ణయించుకుంటాను ఇది ఏ వైద్యశాస్త్రంలోనూ నాకు కనబడదు,’’ అన్నాడు.

– ఎం.డి సౌజన్య



# మారు తాళం చెవి

శివపురంలో ఉండే శేషన్న అనే అతను, తాళాలు బాగుచేయడంలోనూ, మారు తాళం చెవులు తయారు చేయడంలోనూ సిద్ధహస్తుడు.

ఒకనాడు రామయ్య అనేరైతు, శేషన్న దగ్గిరకు ఒక తాళం చెవి పట్టుకొచ్చి, ''శేషన్నా, ఇలాటిదే మరొక తాళం చెవి చేసి పెట్టు,'' అన్నాడు.

రామయ్యను, కొత్త తాళం చెవి కోసం మర్నాడు రమ్మన్నాడు శేషన్న. రామయ్య మర్నాడు శేషన్న దుకాణానికి వెళ్లాడు. శేషన్న అతడికి రెండు తాళం చెవులు ఇచ్చాడు.

రామయ్య, శేషన్న తయారు చేసిన తాళం చెవి కేసి పరీక్షగా చూస్తూ, ''ఇది బాగా పనిచేస్తుందంటావా?'' అని అడిగాడు.

దానికి శేషన్న గర్వంగా, ''నా పనితనం గురించి, మీకు తెలిసే ఉంటుంది! నేను తయారు చేసిన తాళం చెవి పనిచేయకపోవడమంటూ, ఇంతవరకు జరగలేదు,'' అన్నాడు.

అది విని రామయ్య, ''అందుకేగదయ్యా, నీ దగ్గిరకొచ్చింది. పెధవది, ఈ తాళం చెవి పని చెయ్యడం లేదు. అందువల్లే ఇంకో తాళం చెవి చేయించాల్సి వచ్చింది!'' అన్నాడు, తాను శేషన్న కిచ్చిన తాళం చెవి చూపిస్తూ.

– సి.ఎస్.షరీఫ్




## బేతాళ కథ

# నిజమైన చదువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు పట్టిన పట్టు వదలవనే విషయంలో ఇసుమంతకూడా అనుమానం లేదు. అయినా ఇంత రాత్రివేళ నీకు ఈ కష్టం ఏమిటి? తాము చేసే పనికి ఫలితం వచ్చే సమయానికి, సవ్యంగా అడగవలసినది అడగ లేని వారే లోకంలో ఎక్కువ మంది ఉన్నారు. అయాచితంగా కోరని భాగ్యం తలుపు తడుతున్నా ఆ అనుకోని భాగ్యాన్ని కూడా ఉత్తి పుణ్యానికే పోగొట్టుకునే వారే ఎక్కువమంది ఉన్నారు. సిద్ధాన్నం విస్తరి ముందు ఉన్నా చేతులారా పోగొట్టుకునేవారిని ఎవరూ బాగు చేయలేరు అనే విషయం నీకు తెలియనిదేమిటి? ఇందుకు ఉదాహరణగా, కొడుకుకు చక్కటి విద్య పొందే సువర్ణావకాశం వచ్చినప్పటికీ వితండవాదంతో కాలదన్నుకున్న రాజయ్య అన్న రైతు కథ చెప్తాను శ్రమ



తెలియకుండా విను'' అంటూ ఇలా చెప్ప సాగాడు.

చాలా కాలం క్రితం, ఒక ఊరిలో రాజయ్య అనే రైతు ఉండేవాడు. అతనికి ఐదెకరాల మాగాణి పొలం ఉండేది. ఆ ఊరులో ఒక పెద్ద చెరువు ఉండి నీళ్ళు సంవత్సరం పొడు గునా ఉండేవి. అందువల్ల, ఆ గ్రామంలో వ్యవసాయానికి ఎటువంటి అడ్డంకి ఉండేది కాదు. ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా వానలు పడటం, చెరువు నిండటం, దాంతో పొలాలలో పంటలు పండించటానికి, ప్రజలు తాగటానికి కావలిసినన్ని నీళ్ళు ఉండేవి.

రాజయ్య మిగిలిన రైతులలాగానే కష్టపడి పనిచేస్తూ, అదును చూసుకుని వ్యవసాయ పనులు చేసుకుంటూ తన పొలంలో తాను పండించిన ధాన్యాన్ని, కూరగాయలను, పళ్ళను, తన కుటుంబానికి సరిపోగా, మిగిలినవి పొరుగున ఉన్న గ్రామానికి వెళ్ళి అమ్ముకుని తమ కుటుంబానికి కావలిసిన బట్టలు, ఇంట్లోకి కావలసిన దినుసులు గట్రా తెచ్చుకుంటూ ఉండేవాడు.

రాజయ్య ఈ విధంగా తాను కష్టపడుతూ, ఆ కష్ట ఫలితంతో సుఖంగా జీవనం సాగి స్తున్నాడు. రాజయ్యకు ఒక కొడుకు అతడి పేరు వీరన్న. పదేళ్ళ వయసు. ఇప్పుడిప్పుడే రాజయ్య అతడికి పొలం పనులు నేర్పుతూ చిన్న చిన్న పనులు చేయిస్తున్నాడు. తనకు తెలిసిన వీశెలు, మణుగుల లెక్కలు డొక్కలు ఇప్పటికే వాడికి రాజయ్య నేర్పాడు.

రాత్రిళ్ళు బయట వడ్ల పాతర మీద వేసుకున్న మంచం మీద పడుకుని, కొడుక్కి ఆకాశంలో కనిపించే నక్షత్రాలు, చంద్రుడు, మేఘాల గురించి, తన పెద్దలదగ్గర విన్న మాటలను కొడుకుకి చెప్తూ ఉండేవాడు. గాలి వాలు, మేఘాల కదలికలతో ఎప్పుడు వానపడుతుంది, ఎప్పుడు పడదు వంటి విషయాలను కూడ కొడుక్కి నేర్పే ప్రయత్నం చేస్తున్నాడు.

వీరన్న రోజూ మధ్యాహ్నం వేళకి తండ్రికి తల్లి వండి ఇచ్చిన భోజనాన్ని తీసుకు వెళ్ళే వాడు. రాజయ్య కొడుకు తెచ్చిన అన్నం తిని చెట్టు నీడలో కొద్దిసేపు నడుం వాల్చేవాడు. వీరయ్య తండ్రి విశ్రాంతి తీసుకుంటూ ఉండగా, చిన్న చిన్న పనులు పొలంలో చేస్తూ ఉండేవాడు. ఇలా క్రమం తప్పకుండా జరిగిపోతున్నది.

ఒకరోజున రాజయ్య ఉదయాన్నే లేచి పొలానికి వెళ్ళి అక్కడ ఉన్న పళ్ళ చెట్లకి

గొప్ప తవ్వుతున్నాడు. ఈలోగా అతనికి దూరంగా గుర్రం దౌడు తీయటం, గుర్రపు సకిలింపు, మరి కాసేపటికి ఆర్తనాదాలు వినపడ్డాయి. ఆ కేకలు వినవస్తున్నవైపుకు పరుగు పరుగున వెళ్ళిన రాజయ్యకు అక్కడి దృశ్యం చూసేప్పటికి నోట మాట రాలేదు.

అస్తవ్యస్తంగా జీను వేయబడిన గుర్రం బుసలు కొడుతూ కనపడింది. ఆ పక్కనే ఉన్న ఊబిలో ఒక కుర్రవాడు నడుం వరకు కూరుకుపోయి బయటకు రావటానికి కొట్టుకుంటూ, మరింత లోపలకి జారిపోతూ అప్పుడప్పుడూ సహాయానికి కేకలు వేస్తూ ఉన్నాడు. రాజయ్య వెంటనే తేరుకుని, పంచె ఎగ గట్టి, గుర్రాన్ని పెద్దగా కేకలు వేసి అదలించి దూరంగా తరిమి ఆ కుర్రాడితో, ''అబ్బాయీ, భయపడకు, నువ్వు ఎంత కదిలితే అంత ప్రమాదం. కదిలినకొద్దీ నువ్వు ఊబిలోకి మరింత దిగబడిపోతావు. కదల కుండా ఉండు. నేను నిన్ను బయటకు లాగటానికి ప్రయత్నిస్తాను'' అని ధైర్యం చెప్పాడు.

రాజయ్య దగ్గరలోనే ఉన్న ఒక చెట్టుకు ఉన్న పొడవాటి కొమ్మను ఒకటి విరిచి, దాని చివర తన తల గుడ్డను గట్టిగా కట్టి, ఊబి అంచు దగ్గరకు వెళ్ళి, కొమ్మ పొడుగుతో గుడ్డను కుర్రాడిమీదకు తెచ్చాడు. కుర్రాడు చటుక్కున ఆ గుడ్డను గట్టిగా పట్టుకు న్నాడు.

రాజయ్య తన బలాన్నంతా ఉపయో గించి ఊబి అంచునే కాళ్ళు గట్టిగా భూమి మీద నిగడతన్ని నిలబడి లాగసాగాడు. కుర్రాడు కూడా సహాయం అందిన బలంతో, తన వంతు ప్రయత్నం చేసి మెల్లి మెల్లిగా ఊబిలోంచి బయటకు వచ్చాడు. రాజయ్య





అతన్ని జాగ్రత్తగా ఊబిలోంచి బయటకు లాగాడు. భయంతో అవిసిపోయిన ఆ కుర్రాణ్ణి జాగ్రత్తగా చెట్టునీడలోకి చేర్చి, నీళ్ళు తెచ్చి అతని సేద తీర్చాడు. దాహానికి తన దగ్గర ఉన్న నీళ్ళు ఇచ్చాడు.

ఆ కుర్రాడు తేరుకుని మెల్లగాలేచి రాజయ్యకు కృతజ్ఞతలు చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

రాజయ్య తన కాళ్ళు చేతులూ శుభ్రంగా కడుక్కుని, కొడుకు వీరయ్యకోసం ఎదురు చూడసాగాడు. వీరయ్య తెచ్చిన భోజనం తిని యధాప్రకారం చెట్టుకింద కునుకు తీశాడు,

ఆ కుర్రాడి సంగతి పూర్తిగా మరచాడు. మరునాడు, వీరయ్య మధ్యాహ్న భోజనం ముగించి, కొడుక్కి ఆవేళ చెయ్యవలసిన పని చెప్తున్నాడు.

ఈలోగా, పొలానికి ఒక దిక్కున ఉన్న రహదారి మీద పొరుగూరి జమీందారు గుర్రపు బండి వచ్చి వీరయ్య పొలం దగ్గర నిలిచింది. బండి తోలేవాడు తలుపు తియ్యగానే జమీందారు దిగి, వీరయ్య పొలంలోకి చక చకా రాసాగాడు.

ఇది చూసిన వీరయ్య కంగారుపడి, జమీందారు ఎదురు వెళ్ళి, అయ్యా! కాకితో కబురంపితే నేనే వచ్చి తమ దర్శనం చేసుకునే వాణ్ణికదా'' అంటూ నమస్కరించి నిలబడ్డాడు.

జమీందారు ఒక్క మాటకూడ మాటాడకుండా, వీరయ్యను ఆదరంగా కౌగలించుకుని, ''వీరయ్యా, నీకు నేను ఎంతో ఋణపడి ఉన్నాను, నిన్న నువ్వు నా కొడుకుని కాపాడకపోతే ఏమైపోయేవాడిని.'' లేకలేక పుట్టినవాడు కావడంతో గారాబంగా పెంచుతున్నాము. ఏ లోటూ లేకుండా చూసుకుంటూ, కోరిందల్లా కొని ఇస్తూ ముద్దు చేస్తూ ఉన్నాం. దాంతో కనిపించిన ప్రతిదీ కావాలనే మంకుతనం వాడిలో పెరిగిపోయింది.

నిన్న కూడా అలాగే జరిగింది. సవారు కోసం కొత్త గుర్రం కొన్న విషయం నాకూ తెలుసుగదా! కొత్త కాబట్టి మచ్చిక కాలేదని, దాని జోలికి పోవద్దని ఒక వైపు హెచ్చరిస్తూనే ఉన్నాము. వింటే గదా. పైగా వాడికి ఉత్సాహం ఎక్కువ, కొత్త గుర్రానికి జీను తగిలించి స్వారీ చేయబోయి, ఇక్కడ ఊబిలో పడ్డాడు. నాకు నువు చేసిన సహాయం చెప్పాడు.

మా పిల్లాడిని కాపాడి ప్రాణదానం చేసిన నీ రుణం తీర్చుకోలేను. ఈ సహాయానికి గాను కృతజ్ఞత చెబుదామని భావించి,

అసలు నిన్ననే వద్దామనుకున్నాను, కాని అబ్బాయిని సముదాయించి, కచేరీ పనులు చూసుకునేప్పటికి ఈ వేళ అయింది.'' అన్నాడు.

''అయ్యో! నేను చేసింది ఏమున్నదండి అయ్యా! పాపం కుర్రాడు ఊబిలో దిగిపో తుంటే నాకు చాతనైన సహాయం చేశాను. ఆ అబ్బాయి మీ కుమారుడని నాకు తెలి యదు.'' అన్నాడు వినయంగా.

జమీందారు సంతోషంతో తల తాడిస్తూ, ఆ పక్కనే తలకి పాగా చుట్టుకుని, చేత్తో పార పట్టుకుని, వీళ్ళిద్దరిని గమనిస్తున్న వీరయ్య కేసి చూసి, ''రాజయ్యా, వీడేనా నీ కొడుకు?'' అన్నాడు. రాజయ్య తన కొడుకు వీరయ్య తలమీద చేయి వేసి, ''అవునండి, వీడికి పది సంవత్సరాలు నిండినాయి, ఇప్పుడిప్పుడే పనులు నేర్పుతున్నాను, త్వరలోనే చేతికి వస్తాడు'' అన్నాడు.

దానికిజమీందారు, ''అదేమిటి రాజయ్యా! వీడిని కూడ నీలాగ మట్టి పిసుక్కునే వాడిని చేస్తావా? నేను వీడిని తీసికెళ్ళి మా అబ్బా యితో సమానంగా చదివించి, నా కచేరీలోనే మంచి ఉద్యోగం ఇస్తాను, నువ్వు నాకు చేసిన ఉపకారానికి నీకు తగిన పరిహారం ఇచ్చు కోనీ, లేకపోతే నీవు చేసిన సహాయానికి అర్థమే ఉండదు. ఏమంటావు?'' అన్నాడు చిరు నవ్వుతో.

అందుకు, రాజయ్య, ''అయ్యా జమీం దారుగారూ, నేను ఆ కుర్రాడిని ఆపదలో ఉంటే రక్షించానుగాని, మీరొచ్చి ప్రతిఫలం ఇస్తారని కాదు. ఆ సమయంలో ఎవరయినా



అలాగే చేస్తారు కదా! ఆపదలో ఉన్న వాడు ఎవరు ఏమిటి అని చూసి సహాయం చేయం కదా! మా అబ్బాయి, వీరయ్యకు, నేను చెప్పవలసిన చదువు చెప్తూనే ఉన్నానయ్యా.

ఇంతకంటే ఇంకా మంచి చదువు ఉందం టే నేను ఒప్పుకోను బాబూ. పనికొచ్చే ఒక్క పని చేయకుండా, కచేరీలో కూచుని ఎవ రెవరో చేసిన పనులకు లెక్కలు వేస్తూ, కర్ర పెత్తనం చేస్తున్నట్టుగా మా వీరయ్యను ఊహించుకోలేకుండా ఉన్నానండి.

అయ్యగారూ. నేను మా అబ్బాయికి చెప్పేది కూడ మంచి చదువే అనుకుంటు న్నాను, క్షమించండి, నా చదువు మా అబ్బా యికి చెప్పుకోనివ్వండి, అదే నేను మీ దగ్గరనుంచి కోరే ఉపకారం.'' అన్నాడు వినమ్రంగా.

జమీందారు రాజయ్య మాటలు విని అచ్చెరువొందాడు. పొలంలో పనిచేసుకునే

రాజయ్యకు ఇంతటి చక్కటి జ్ఞానం ఉన్నదా అని ఆశ్చర్యపోతూ అతడికి కృతజ్ఞత తెలిపి తిరిగి వెళ్ళిపోయాడు.

జమీందారు అంతటితో ఊరుకోలేదు, తన జమీలో ఉన్న రైతుల సమస్యలు తెలుసుకుని వాటన్నిటిని పరిష్కరించే ప్రయత్నం చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రైతు రాజయ్య ఇంత తెలివి తక్కువగా ఎందుకు ప్రవర్తించాడు? జమీందారు తన కొడుకును తీసుకెళ్ళి చదువు చెప్పించి పెద్ద ఉద్యోగం ఇప్పిస్తానన్నా ఎందుకు ఒప్పుకోలేదు?

ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడ చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజయ్య తెలివి తక్కువగా ఏమీ ప్రవర్తించలేదు. తాను చెప్పేది కూడ చదువే అని గట్టిగా నమ్ముతున్నవాడు.

అంతకంటే మరొక చదువు విలువైనది, అది తన కొడుకుకు చెప్పించి అదేదో ఉపకారం అన్నట్టుగా జమీందారు మాటలు అతనికి బాధ కలిగించాయి. రాజయ్య అనుకున్నట్టుగానే, అతను చెప్పేది చాలా మంచి చదువు. తరతరాల విజ్ఞానమంతా తన కొడుక్కి తన పద్ధతిలో బోధించటానికి ప్రయత్నిస్తున్నాడు.

కాకపోతే, జన బాహుళ్యంలో చదువు అంటే వ్రాయటం చదవటం అనే ప్రచారంలో ఉన్నది. అది సరికాదు.

తన బ్రతుకు తాను బ్రతకటానికి అనువైన వృత్తి చేపట్టటానికి అనువైన విజ్ఞానాన్ని అందించేది ఏదైనా చదువే.

ముఖ్యంగా వ్యవసాయం, చేతి వృత్తులు తర తరాలుగా వస్తూనే ఉన్నాయి. వ్యవసాయం బడిలో కూచుని చదివితే వచ్చేది కాదని రాజయ్యకు తెలుసు.

అందుకనే తాను తన తండ్రి దగ్గర నేర్చుకున్నట్లే తన కొడుక్కి నేర్పుతున్నాడు'' అని చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

– కప్పగంతు శివరాంప్రసాద్



16

# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

చిత్రాలు: గాంధి అయ్య

థార్విక్, మరిఘాలు తోబుట్టువులు, ఇద్దరూ ధర్మపితకే జన్మించారు. అద్భుత మాంత్రికుడు సలూంకీ కామరూప శక్తుల గురించి ప్రభాత్‌కు నేర్పుతాడు.






తన అన్వేషణను వదులుకోమని ఎందరు ఎంతగా చెప్పినా సలూంకీ వినలేదు. అయితే ఎంతగా తను గాలించినా మాణిక్యాన్ని కనుగొనలేకపోయాడు. ఒక రోజు...




ఎలాగోలా సలూంకీ ప్రభాత్ వద్దకు వచ్చాడు. చాలా సేపు ఇద్దరూ కలిసి ఉన్నారు.
దయచేసి మా తండ్రిని కలవండి.
కలవలేను. మా స్నేహం రహస్యంగానే ఉండాలి..
క్షమించాలి! బాగా గాయపడ్డావా?
నావద్ద కొన్ని రహస్యాలు ఉన్నాయని సలూంకీ గుర్తించాడు. అతడికి కుతూహలం పెరిగిపోయింది.
ఒకరోజు, ప్రభాత్‌కు కత్తిసాము నేర్పుతున్నప్పుడు సలూంకీ అతడి చేతిని తీవ్రంగా గాయపర్చాడు. రక్తం కారింది.
నా గురించి మరింతగా తను తెలుసుకో వలసిన అవసరముంది. మరింతగా తెలుసుకోవాలంటే అతడు మంత్రాన్ని ఉపయోగించవలసిందే..
నీకు నువ్వు గాయపర్చుకోకుండా నీవు మాణిక్యాన్ని పొందలేవు.


ఎందుకు?
మాణిక్యం రక్తధారలోంచి మాత్రమే నడిచిపోతుంది. నీవు గాని దాన్ని పొందావంటే చస్తావు.
నా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరే అని అంటున్నావా?
ఆ అబ్బాయి మరీఘాతో రక్తం పంచుకుని పుట్టాడు. అతడిని ఉపయోగించుకో.
అయితే ఒకసారి అతడు మాణిక్యం పొందాక, దానిని నాకు ఇచ్చేలా చేయగలమార్గం ఉందా?
అతడిని నీ బిడ్డగా మార్చుకో..
(ఇంకా ఉంది)



# రామాయణం

## ఉత్తర కాండ - 3

మర్నాడు రాముడు కొలువుతీరి ఉండగా, ఒక కుక్క వచ్చి బయట మొరిగింది. లక్ష్మణుడు, ఆ కుక్క రాజుతో ఏదో ఫిర్యాదు చేయగోరుతున్నదని తెలుసుకుని, దాన్ని సభలోకి తీసుకువచ్చాడు. తల పగిలి ఉన్న ఆ కుక్కను చూసి రాముడు, ''నీకు కలిగిన కష్టం గురించి నాతో నిర్భయంగా చెప్పు,'' అన్నాడు. ''సర్వార్థసిద్ధి అనే భిక్షువు నా తల పగులగొట్టాడు. నేనతనికే అపకారమూ చెయ్యలేదు,'' అన్నది కుక్క.

రాముడు వెంటనే ఆ భిక్షువును పిలిపించి, ''నీవీ కుక్క తల ఎందుకు పగలగొట్టావు? అది నీకేం అపకారం చేసింది?'' అని అడిగాడు.

''రాజా, నేను భిక్షకోసం ఇల్లిల్లూ తిరుగుతున్నాను. నా కెక్కడా భిక్ష దొరకలేదు. ఈ స్థితిలో ఈ కుక్క నా దారికి అడ్డంగా నిలబడి, ఎంత అదిలించినా పోలేదు. కోపం అణుచుకోలేక దాన్ని తల మీద కొట్టిన మాట నిజమే. దానికే దండన విధిస్తారో విధించండి'' అన్నాడు సర్వార్థసిద్ధి.

అతనికి ఎలాటి శిక్ష విధిస్తే బాగుంటుందని రాముడు సభలోని వాళ్లను అడిగాడు. సభలో ఎందరో పండితులుండి కూడా ఏ ఒక్కరూ సూటిగా సమాధానం చెప్పలేదు.

అప్పుడు కుక్క రాముడితో, ''రామా, ఇతనికి నేను చెప్పిన శిక్ష వెయ్యి. కాలంచర మనేచోట కులపతిగా అతనికి ఉద్యోగమివ్వు''





అన్నది. రాముడతనికి ఆ ఉద్యోగం ఇచ్చి, ఏనుగుమీద ఎక్కించి పంపేశాడు. భిక్షువు కూడా పరమానందం చెంది వెళ్లిపోయాడు.

తరవాత రాముడూ, మంత్రులూ ఆ కుక్కను, ''ఆ భిక్షువుకు ఇలాంటి శిక్ష ఎందుకు వేయించావు? దీనికేదో కారణం ఉండాలి,'' అన్నారు.

''నేను కిందటి జన్మలో ఆ ఉద్యోగమే చేశాను. ఆ పదవిలో నాకు చక్కని భోజనమూ, దాసదాసీలూ, సమస్తమూ అమరి ఉండేవి. ఎంతో భూతదయ కలిగి, వినయమూ, శీలమూ కలవాడిననిపించుకున్నాను. దేవ బ్రాహ్మణ పూజ చేశాను.

అయినప్పటికీ ఆ పదవిలో ఉండినందు వల్ల నాకీ నీచజన్మ కలిగింది. మహా కోపీ, దయారహితుడూ అయిన ఈ భిక్షువు ఆ పదవి నిర్వహించాడో జన్మజన్మలకీ ఘోర నరకం పాలు అయితీరతాడు,'' అన్నది కుక్క. కుక్క వెళ్లిపోయాక, ఒక గుడ్లగూబా, గద్దా తగాదాపడి తీర్పు చెప్పమని రాముడి వద్దకు వచ్చాయి. ఒక వనంలో ఒక ఇల్లున్నది. ఆ ఇల్లు నాదంటే నాదని రెండు పక్షులూ తగాదా పడుతున్నాయి. ఈ తగాదా తీర్చేటందుకు గాను రాముడు పుష్పక విమానం మీద తన మంత్రులతో సహా ఆ ఇల్లున్న చోటికి వెళ్లాడు. ''ఈ ఇంటిని నువ్వెప్పుడు కట్టుకున్నావు?'' అని రాముడు గద్ద నడిగాడు. ''భూమి మీద మనుషులు పుట్టిన కాలంలో నేనీ ఇల్లు కట్టుకున్నాను.'' అన్నది.

వెంటనే రాముడి మంత్రులు ఆ ఇల్లు గుడ్లగూబదేనని తేల్చారు. ఎందుచేతనంటే సృష్టిలో మొదట వచ్చినవి వృక్షజాతులు. గుడ్లగూబ ఇంటిని కాజెయ్యాలని చూస్తున్నది గనక గద్దను శిక్షిస్తానన్నాడు రాముడు. అప్పుడు ఆకాశవాణి ఇలా పలికింది.

''రామా అసలే శాపం తిని ఉన్న ఈ గద్దను ఇంకా ఎందుకు శిక్షిస్తావు? ఈ గద్ద బ్రహ్మదత్తుడనే రాజు, మహా ధనికుడు, శూరుడు, సత్యవ్రతుడు. ఇతని ఇంటికి గౌతముడు వచ్చి అతిథిగా ఉన్నాడు. గౌతముడికి రాజు స్వయంగానే అర్ఘ్యపాద్యాలిచ్చాడు. గౌతముడు బ్రహ్మదత్తుడి ఆతిథ్యం స్వీకరిస్తున్న సమయంలో ఒకనాడు ఆయన భోజనంలోకి పొరపాటున మాంసం వచ్చింది. అది చూసి గౌతముడు కోపించి, రాజును గద్దవు కమ్మని శపించాడు. ఆ తర్వాత, ఇక్ష్వాకు వంశంలో పుట్టే రాముడు తాకినప్పుడు శాపవిముక్తి కలుగుతుందని గౌతముడన్నాడు.''

ఆకాశవాణి పలికిన ఈ మాటలు విని రాముడా గద్దను తాకాడు. వెంటనే గద్ద ఒక దివ్యపురుషుడుగా మారింది. ఆ పురుషుడు రాముడికి కృతజ్ఞత తెలుపుకుని వెళ్లిపోయాడు.

యమునాతీర వాసులైన మునులు నూరు మందికి పైగా రాముడి దర్శనార్థం ఒకనాడు వచ్చారు. వారు కలశాలతో తెచ్చిన నీరూ, పళ్లూ మొదలైన కానుకలు స్వీకరించి, వారందరినీ సుఖాసీనులను చేసి రాముడు, వారు వచ్చిన పని అడిగాడు. లవణాసురులుడనే వాడు తమని మహాబాధ పెడుతున్నాడని, వాడి బాధ నుంచి విముక్తి కలిగించమనీ మునులు రాముడిని కోరారు.

ఈ లవణాసురుడనేవాడు మధువనే రాక్షసుడి కొడుకు, మధువు రుద్రుడిని గురించి బహుదీర్ఘమైన తపస్సు చేసి, ఆయనను మెప్పించాడు. దాని ఫలితంగా రుద్రుడు తన త్రిశూలంలో నుంచి మరొక త్రిశూలం చేసి మధువుకిస్తూ, ''అది వెంట ఉన్నంత కాలమూ నిన్నెవరూ జయించలేరు.'' అని చెప్పాడు.

ఆ త్రిశూలాన్ని వంశపరంపరగా తన ఇంటనే ఉండేటట్టు అనుగ్రహించమని మధువు శివుడిని వేడుకున్నాడు. ''నీ అనంతరం ఈ త్రిశూలం నీ కొడుక్కి మాత్రమే ఉంటుంది. అటుపైన ఉండదు'' అన్నాడు శివుడు.

ఆ మధువు రావణుడికి చెల్లెలు వరస అయిన కుంభీనసను పెళ్లాడాడు. వారికి లవణుడు పుట్టాడు. వాడు పసితనం నుంచీ మహాపాపీ, వాడిని మంచిదారిన పెట్టడం మధువు వల్ల కాలేదు. మధువు వరుణలోకా



నికి వెళ్లి అందరినీ బాధిస్తున్నాడు, మునులను మరింత వేపుకు తింటున్నాడు.

మునులు చెప్పిన విషయాలు ఆలకించి రాముడు వారితో ''లవణాసురుడిని నేను చంపిస్తాను. మీరు నిర్భయంగా ఉండండి'' అని అభయమిచ్చాడు. తరవాత అతను తన తమ్ములను చూసి ''లవణాసురుడిని చంపే పనికి ఎవరు పూనుకుంటారు?'' అని అడిగాడు.

భరతుడు తానా పని చేస్తానన్నాడు. కాని శత్రుఘ్నుడు భరతుడిపైన పోటీకి వచ్చి, తానే లవణాసురుడిని చంపుతాననీ, తానుండగా భరతుడు శ్రమపడటం భావ్యం కాదనీ, పడవలసిన శ్రమలన్నీ భరతుడు లోగడ నందిగ్రామంలో ఉన్నప్పుడే పడ్డాడనీ అన్నాడు.

రాముడందుకు ఒప్పుకుని, శత్రుఘ్నుడిని మధుపురానికి రాజుగా అభిషేకించే ఏర్పాట్లు చేశాడు. ఒక రాజు చచ్చిపోతే మరొ



కడు వెంటనే రాజ్యభారం వహించడానికి సిద్ధంగా ఉండాలి.

శత్రుఘ్నుడి రాజ్యాభిషేకోత్సవం ముగియగానే రాముడు అతని కొక బాణం ఇచ్చి, ఇలా చెప్పాడు. ''ఈ బాణం మధుకైటభులను చంపినది. దీన్ని నేను రావణుడిపైన కూడా ప్రయోగించలేదు. దీనితో నీవు లవణాసురుడిని చంపు. మరొక సంగతి, లవణుడి వద్ద శివుడి త్రిశూలానికి సమమైన శూలం ఉన్నది. అది వాడి చేతిలో ఉండగా ఎవరూ వాడిని జయించలేరు. అందుచేత నీవేం చేస్తావంటే – లవణుడి త్రిశూలం వాడి ఇంటనే ఉంటుంది. వాడు నగరం వదిలి ఎటైనా వెళ్లి ఉన్న సమయంలో నీవు నగర ద్వారం ముట్టడించి, వాడు తిరిగి వచ్చినప్పుడు ద్వారం వద్దనే అటకాయించి చంపు. ఏ పరిస్థితిలోనూ వాడు నగరం లోకి వెళ్లరాదు, త్రిశూలం వాడి చేతికి చిక్కరాదు.''

అంతేకాదు, శత్రుఘ్నుడు ముందుగా సేనను పంపి, తరవాత తాను ఒంటరిగా వెళ్లాలి. తనను చంపటానికెవరో వస్తున్నట్లు లవణుడికి తెలియగూడదు. గ్రీష్మర్తువులోనే సేనలు గంగ అవతలి ఒడ్డు చేరి అక్కడ విడియాలి. శత్రుఘ్నుడు వర్షాకాలారంభంలో విల్లుబాణాలు తీసుకుని బయలుదేరి వెళ్లి లవణాసురుడిని వధించాలి. ఈ విధంగా రాముడు యుద్ధగతి నిర్ణయించాడు.

ఆ ప్రకారమే శత్రుఘ్నుడు ముందుగా తన సేనలను పంపి, ఒకమాసం గడిచాక తాను బయలుదేరాడు. దారిలో రెండు రోజులపాటు అతను వాల్మీకి ఆశ్రమంలో నిలిచాడు. వాల్మీకి అతనికి ఆతిథ్యమిచ్చి, ఆ ఆశ్రమం ఒకప్పుడు రఘువంశం వారిదే నంటూ దాని కథ ఇలా చెప్పాడు.

రఘువంశంలో ఒకప్పుడు సుదాసుడనే వాడుండేవాడు. ఆయన కొడుకు వీరసహుడు. చిన్నతనంలోనే వేటకు వెళ్లి వనంలో ఇద్దరు రాక్షసులను చూశాడు. ఆ రాక్షసులు పులుల రూపంలో తిరుగుతూ కనిపించిన మృగాన్నల్లా తినేస్తూ, అరణ్యమంతా పాడు పెట్టేశారు. ఎక్కడా ఒక మృగం లేదు.

అది చూసి వీరసహుడికి చాలా కోపం వచ్చింది. అతనా రాక్షసులిద్దరినీ చూస్తూనే వారిలో ఒకడిని చంపేశాడు. అప్పుడు రెండోవాడు, ''పాపీ, అకారణంగా నా అనుచరుడిని చంపావు కదూ? నిన్నేం చేస్తానో చూడు,'' అంటూ అదృశ్యుడయిపోయాడు.

కొంత కాలం గడిచింది. ఆ రాజు ఇదే ఆశ్రమంలో ఒక బ్రహ్మాండమైన అశ్వమేథ

యాగం చేశాడు. వశిష్టుడే ఆ యాగం చేయిం చాడు. యాగం పూర్తి అయేసరికి వెనకటి రాక్షసుడు, రాజుపైన పగబట్టి ఉన్న వాడు గనక, వసిష్ఠుడి రూపంలో వచ్చి, ''రాజా యజ్ఞం పూర్తి అయింది. నాకు చక్కని మాంస భోజనం పెట్టు,'' అని అడిగాడు.

రాజు సంతోషించి వంటవాడిని పిలిచి ''గురువుగారికి హవిస్సు మాంసంతో రుచిగా భోజనం తయారుచెయ్యి,'' అన్నాడు. ఈ లోపుగానే రాక్షసుడు వంటవాడి రూపంలో నరమాంసంతో వంట సిద్ధం చేసి, రాజుకు చూపించి, హవిస్సుతో చక్కని వంట చేశాను,'' అన్నాడు. రాజు వసిష్టుడికి తన భార్య అయిన మదయంతి చేత ఆ నరమాంసం వడ్డింపిం చాడు. నిజవసిష్టుడు తనకు వడ్డించినది నర మాంసమని గుర్తించి, ఆగ్రహించి, ''నువ్వు నరభక్షకుడివైపో!'' అని రాజును ఘోరంగా శపించాడు. రాజుకు కూడా కోపం వచ్చి, వసిష్టుడిని శపించడానికి నీరు చేతిలోకి తీసుకున్నాడు. కాని, అతను శపించే లోపుగా మదయంతి అడ్డుపడి, ''ఆయన మనకు దేవుడిలాటివారు. ఆయనను శపించరాదు.'' అన్నది. అప్పుడు రాజు చేతిలో నీళ్లను తన పాదాలమీదనే పోసేసుకున్నాడు. ఆ నీటివల్ల రాజు పాదాలకు కల్మషం కలిగింది. అప్పటి నుంచి అతనికి కల్మషపాదుడనే పేరు వచ్చింది.

తరవాత వసిష్టుడు జరిగినసంగతి గ్రహించి, కల్మషపాదుడికి శాపఫలం పన్నెండేళ్లు ఉండే టట్టు అనుగ్రహించాడు. రాజు పన్నెండేళ్ల పాటు నరభక్షకుడుగా జీవించి, శాపం తీరి మామూలు మనిషి అయి, ఎప్పటిలాగే రాజ్య పాలన చేశాడు. ఈ కథను వాల్మీకి వల్ల విని శత్రుఘ్నుడు పర్ణశాల ప్రవేశించే సమయా నికి సీత కవలపిల్లలను కన్నది. ఈ వార్త



మునికుమారుల ద్వారా వినగానే వాల్మీకి వెళ్ళి, బాలచంద్రుల్లాగా ప్రకాశించే పిల్లలను చూసి, రక్షలు కట్టి, పెద్దవాడికి కుశుడనీ, రెండోవాడికి లవుడనీ పేర్లు పెట్టాడు.

ఇది జరిగింది సరిగా అర్ధరాత్రి వేళ. ఆ సమయంలోనే శత్రుఘ్నుడు సీత వద్దకు వెళ్ళి, ''అమ్మా అదృష్టం,'' అని ఎంతో సంతోషించాడు. మర్నాడు అతను వాల్మీకి వద్ద సెలవు పుచ్చుకుని, పడమరగా ప్రయాణిస్తూ, అక్కడి మునుల ఆశ్రమాలలో సత్కాలక్షేపం చేస్తూ ఆ రాత్రి గడిపాడు. మర్నాడు తెల్లవారగనే శత్రుఘ్నుడు చ్యవన మహామునిని లవణాసురుడిని, వాడి త్రిశూలం గురించి అడిగాడు. చ్యవనుడు మాంధాత వృత్తాంతం వివరించి చెప్పాడు. అయోధ్య రాజైన యవనాశ్వుడి కుమారుడు మాంధాత, మహాబలవంతుడైన ఆ మాంధాత భూమిలో ఉండే రాజులనందరినీ జయించి, స్వర్గానికి వెళ్ళి దాన్ని కూడా జయించ నిశ్చయించాడు. ఆ సంగతి తెలిసి, ఇంద్రుడు మొదలైన దేవతలు భయపడ్డారు.

ఇంద్రుడి అర్ధాసనమూ, దేవతల సేవా కోరి వచ్చిన మాంధాతతో ఇంద్రుడు మంచిగానే, ''ముందు భూలోకాన్ని జయించి రా, అప్పుడు దేవలోకాన్ని నీకిచ్చేస్తాం.'' అన్నాడు.

''అదేమిటి? భూలోకమంతా అదివరకే జయించాను. అక్కడ నా శాసనానికి ఎదురులేదు.'' అన్నాడు మాంధాత.

''మధువనంలో లవణాసురుడనేవాడున్నాడు. వాడు నీకు లోబడి నడుచుకుంటున్నాడా?'' అని ఇంద్రుడు మాంధాతనడిగాడు.

మాంధాత సిగ్గుపడి తల వంచుకుని భూమికి తిరిగి వచ్చి, లవణుడిని జయించడానికి సేనా సమేతుడై బయలుదేరి వెళ్ళి, తనకు లొంగిపొమ్మని లవణుడికి కబురు చేశాడు. లవణుడా దూతను పట్టుకుని తినేశాడు. ఎంత కాలానికీ దూత తిరిగి రాకపోగా, మాంధాత లవణుడి పైన యుద్ధం ప్రారంభించాడు. లవణుడు నవ్వి, తన శూలాన్ని ప్రయోగించే సరికి, అది మాంధాతని, అతని సైన్యమంతటినీ భస్మం చేసేసింది.

చ్యవనుడీ సంగతి చెప్పి, ''వాడి చేతిలో ఆ త్రిశూలం లేని సమయంలోనే నువు వాడిని చంపాలి. రేపే ఆ పని చెయ్యగలుగుతావు,'' అన్నాడు. ఆ రాత్రి కబుర్లతో సులువుగా గడిచిపోయింది.





# పంచతంత్ర కథలు

## మిత్రభేదం – 6

కరటకం దమకానికి ఆషాఢభూతి పలాయనం విషయం చెప్పి, ఇంకా ఇలా చెప్ప సాగింది: ఆషాఢభూతి మీద పూర్తి నమ్మకంతో తన కాలకృత్యాలు నిర్వర్తించటానికి అవతలికి వెళ్లిన దేవశర్మ తన సమీపంలోనే ఒక దృశ్యం చూశాడు.

పొట్టేళ్ల మంద ఒకటి మేత మేస్తున్నది. అందులో రెండు పొట్టేళ్లు పోట్లాడసాగాయి. అవి రెండూ పరిగెత్తుకుంటూ వచ్చి, తలలు ఢీ కొట్టుకుని, మళ్లీ వెనక్కు వెళ్ళి పరిగెత్తుకుంటూ వచ్చి బలంగా తలలు ఢీ కొట్టుకుంటున్నాయి. వాటి తలలు పగిలి రక్తం నేల మీద కారుతున్నది. నేల మీద కారిన రక్తాన్ని నాకాలన్న ఆత్రంతో ఒక నక్క వచ్చింది. పొట్టేళ్లు ఆ సమయంలో ఎడంగా వెళ్లాయి.

దేవశర్మ ఆ నక్కను చూసి, ''ఈ నక్కకు బుద్ధి లేదు. ఈ సారి పొట్టేళ్లు తలలు ఢీ కొట్టినప్పుడు ఇది నిశ్చయంగా వాటి మధ్య నలిగి చస్తుంది,'' అనుకున్నాడు.

ఆయన అనుకున్నట్లే పొటేళ్లు మళ్లీ పరిగెత్తుకుంటూ వచ్చి తలలు మోటించాయి. రక్తం తాగటంలో మైమరిచి ఉన్న నక్క ఆ పొటేళ్ల తలల మధ్య నలిగి చచ్చింది.

చచ్చిన నక్క గురించి చింతిస్తూ దేవశర్మ తన శిష్యుడు ఉండిన చోటికి వచ్చాడు. ఆషాఢభూతి కనిపించలేదు.

దేవశర్మ గబగబా స్నానం చేసి వచ్చి చూసే సరికి ఆయన బట్టల మూట ఉన్నది కాని, బంగారం మూట మాత్రం కనబడకుండా పోయింది.

అయ్యో, ''నా బంగారం పోయింది,'' అనుకుంటూ దేవశర్మ మూర్ఛపోయాడు.

కొద్ది సేపటికి స్పృహ వచ్చిన దేవశర్మ, ''ఒరే, ఆషాఢభూతీ! నన్ను మోసగించి ఎక్కడికి పోయావురా? జవాబు చెప్పరా!'' అని వైనవైనాలుగా ఏడుస్తూ, వాణ్ణి కలుసుకుందామనే ఆశతో, వాడి అడుగు జాడలను బట్టి బయలుదేరాడు.





సాయంకాలం అయేసరికి అతడు ఒక గ్రామం చేరాడు. కల్లు అంగడికి పోతున్న సాలె దంపతులు తనకు కనిపించారు.

అతడు సాలెవాడితో ''నాయనా అసుర సంధ్యవేళ నేను నీకు అతిథిగా వచ్చాను. నాకు ఇక్కడ ఎవరూ తెలియదు. అందుచేత నన్ను అతిథిగా స్వీకరించి, ఆతిథ్యం ఇయ్యి,'' అన్నాడు.

ఈ మాటలు విని సాలెవాడు తన భార్యతో, ''ఏమే, ఈయనను మన ఇంటికి తీసుకు పోయి, కాళ్ళు కడిగి, భోజనంపెట్టి పక్కవేసి ఆయనకు ఏం కావాలో చూస్తూ ఇంటి దగ్గరే ఉండు. నేను వెళ్ళి ఇంత మాంసమూ, కల్లూ తెస్తాను.'' అన్నాడు.

సాలెవాడి భార్య మరొకరితో సంబంధంలో ఉంది. తన ప్రియుడైన దేవదత్తుడిని కలుసుకోవటానికి మంచి అవకాశం దొరికినందుకు పరమానందభరితురాలై, ఆమె దేవశర్మను వెంటబెట్టుకుని ఇంటికి వడివడిగా బయలు దేరింది. ఇంటికి చేరగానే ఆమె దేవశర్మకు ఒక కుక్కి మంచం చూపి, కూర్చుండబెట్టి తనకు కలిగిన రీతిలో సపరిచర్యలు చేసింది.

దేవశర్మ కాస్త స్థిమిత పడ్డ తర్వాత ఆమె ప్రాధేయపూర్వకంగా అతడితో ఇలా చెప్పింది. ''స్వామీ! నా స్నేహితురాలు ఒకతె ఇవాళే వాళ్ల గ్రామం నుంచి వచ్చింది. దానితో మాట్లాడి ఇప్పుడే వస్తాను. నేను వచ్చేదాకా ఇల్లు కాస్త చూస్తూ ఉండండి.'' అని చెప్పి, మంచి బట్టలూ, నగలూ ధరించి, దేవదత్తుణ్ణి కలుసుకోవడానికి వెళ్లింది.

కాని దారిలో ఆమెకు తన భర్త, తప్పతాగి తూలుతూ, అడుగులు తడబడుతూ, జుట్టు రేగి, చేతిలో కల్లుముంత పట్టుకుని వస్తూ కనిపించాడు. అది చూసి గజగజా వణికిపోయిన ఆమె అతి వేగంగా ఇంటికి పరిగెత్తుకుని వచ్చి, తన మంచి బట్టలూ, అలంకారాలూ తీసేసి, పాత బట్టలు ధరించింది. ఏమీ ఎరగనట్లుగా భర్త రాక కోసం ఎదురు చూస్తున్నట్లుగా గడప ముందు నిలుచుంది.

అయితే ఆమె మంచి బట్టలూ, అలంకారాలూ ధరించి పరిగెత్తిపోతూ ఉండడం సాలెవాడు చూసి కూడా చూడనట్లు నటించాడు.

తన భార్య తిరుగుళ్లను గురించి అతడికి తెలుసు. అతిథికి మర్యాద చేయవలసిన భార్య అలా వీధిలో కనబడగానే అతడికి ఆమెపై మరింత అనుమానం కలిగింది. అతడు ఇంటికి వచ్చి భార్యను చూసి, పట్ట

రాని కోపంతో, ''ఓసీ, నీచురాలా! కులటా! ఎక్కడికి పోతున్నావు?'' అన్నాడు.

''నిన్ను వదిలినాక నేను ఎక్కడికీ పోలేదే? ఎందుకా తాగుడు వాగుడు? తాగిన వాడి నోటికి శుద్ధీ, బుద్ధీ ఉండదంటారు'' అన్నది అతడి భార్య

తన భార్య పొగరు మాటలు విని, ఆమె చీరమార్చి ఉండటం గమనించిన సాలెవాడు, ''నీ పోకిళ్ల గురించి అదివరకే విన్నాలే. ఇవాళ కళ్లారా చూశాను. నిన్ను ఏం చేస్తానో చూడు!'' అంటూ ఒక దుడ్డుకర్ర తీసుకుని తన భార్య ఒళ్లంతా హూనం చేసి, ఆమెను స్తంభానికి పలుపుతో కట్టేసి, తాగిన మైకంలో పడుకుని నిద్రపోయాడు.

ఈ సాలెవాడి భార్యకు ఆమె స్వభావమే కలిగిన స్నేహితురాలు మంగలి మహిళ ఒకతె ఉన్నది. ఆమె వచ్చి, సాలెవాడు నిద్రపోతు న్నాడని రూఢి చేసుకుని, అతని భార్యతో, ''దేవదత్తుడు నీకోసం కనిపెట్టుకుని ఉన్నాడు. ఎందుకు ఆలస్యం చేస్తున్నావు త్వరగా వెళ్లు,'' అన్నది.

''నేను ఎలా వెళ్లేది? ఏ స్థితిలో ఉన్నానో చూడు. నన్ను చావబాదింది కాకుండా ఇలా పలుపుతో కట్టేశాడు. ఎలా వెళ్ళేది? నా మొగు డేమో ఇంట్లోనే ఉన్నాడాయె,'' అన్నది సాలె వాడి భార్య విచారంగా.

''నేను నీ కట్లు విప్పుతాను. ఏనుగొచ్చి ఘీంకరించినా, నీ మొగుడు రేపు మొహం మీద ఎండపడే దాకా లేవడు. అంతగా అయితే నీకు బదులు నన్ను కట్టేయి. నీ మొగుడు రాత్రివేళ లేచినా మైకంలో నన్ను



చూసి నువ్వే అనుకుంటాడు. ఇక ఆలస్యం చేయకుండా నువ్వు దేవదత్తుడి వద్దకు వెళ్లి త్వరగా రా'' అన్నది స్నేహితురాలు.

సాలెవాడి భార్య తన కట్లు విప్పించుకుని, తన స్థానంలో తన స్నేహితురాలిని స్తంభానికి కట్టి వేసి, ఆ తర్వాత దేవదత్తుణ్ణి కలుసుకో వడానికి వెళ్లింది.

ఆమె వెళ్లిన కొంతసేపటికి సాలెవాడు శాంతపడి లేచి, ''ఒసే గయ్యాళి గంపా! ఇక ముందు ఇల్లు కదలననీ, నాతో పొగరుగా మాట్లాడనని మాట ఇస్తే నీ కట్లు విప్పుతాను. నన్నే మోసగిస్తావా? ఎంత బరితెగింపే నీకు?'' అన్నాడు.

మంగలామె, తన గొంతు గుర్తిస్తాడని సాలెవాడికి సమాధానం చెప్పలేదు. దాంతో సాలెవాడికి ఒళ్లు మండి, పదునైన కత్తి తెచ్చి, మంగలి దాని ముక్కు పరపరా కోసి, ''ఎప్ప టికీ ముక్కిడి ముండవుగా ఉండిపో దరిద్ర

పుదానా,'' అని తిట్టి మళ్లీ వెళ్లి నిద్రలోకి జారుకున్నాడు.

మంగలామెకు వణుకు పుట్టింది. పుణ్యానికి పోయి పాపమెదురైనట్లుగా సాలెవాడి ఇంట్లో తన ముక్కుకు కోత పడిందే అని ఆమె తీవ్రంగా విచారపడింది. మరో వైపు గాయం సలుపుతోంది. గట్టిగా ఏడుద్దామన్నా పరిస్థితులు అనుకూలంగా లేవు. నోరు పెగిలిందా భండారం బయటపడినట్లే. దాంతో ఆమె కదలక మెదలక గుంజకు అనుకుని నిలుచుండిపోయింది.

బంగారాన్ని పోగొట్టుకున్న బాధకు ఆకలీ, దప్పీ తోడై, నిద్రపోలేకుండా ఉన్న దేవశర్మ సాలెవాడి ఇంట్లో జరుగుతున్న ఈ నాటకమంతా కళ్లారా చూశాడు.

కొంత సేపు గడిచాక, సాలెమనిషి తిరిగి వచ్చి మంగలి మనిషిని, ''ఎలా ఉన్నావు? నేను వెళ్లినాక ఆ దుర్మార్గుడు లేచాడా?'' అని అడిగింది.

'నేనైతే బాగానే ఉన్నాను గాని, నీ మాయదారి మొగుడు లేచి, నా ముక్కు కోశాడు. వాడు లేచి నా చెవులు కూడా కోసే లోపల, కట్టు విప్పి నన్ను ఇంటికి పోనీ తల్లీ!,'' అన్నది మంగలి మనిషి. సాలె మనిషి మంగలిదాని కట్లు విప్పి, ఆమె స్థానంలో తాను కట్టించుకున్నది. తరువాత ఆమె భర్తను ధిక్కరిస్తూ, ''ఓ మూఢుడా! నావంటి శీలవతిని గాయపరచటమూ, తరవాత వికృతం చెయ్యటమూ నీ తరమా?

ఓ దిక్పాలకులారా! సూర్యచంద్రులారా! అగ్నిహోత్రుడా! వాయుదేవుడా! వినండి! నేనే పతివ్రతనైతే నా ముక్కును యధాప్రకారం చేయండి...! చూశావా దుర్మార్గుడా? నువు ముక్కు కోసివేసినా నా శీలబలం చేత నా ముక్కు ఎప్పటిలాగే అయింది!'' అన్నది.

తన భార్య అబద్ధం ఆడుతూంటే దాన్ని అగ్నికి ఆహుతి చేద్దామని, సాలెవాడు మండే కొరివితో వచ్చి, తన భార్య ముక్కు ఎప్పటిలాగే ఉండటం చూసి నిర్ఘాంతపోయాడు. తొలిసారిగా అతనికి భయం పట్టుకుంది.

తాను నిజంగా ముక్కు కోయలేదేమో అనుకుందామంటే నేల మీద రక్తం మడుగు ఉన్నది. అతను వెంటనే ఆమె కట్లు విప్పి, ఆమెకు వెయ్యి క్షమాపణలు చెప్పుకుని, ఆమెను సంతోష పెట్టడానికి సర్వవిధాలా యత్నించాడు.





# టర్కీ జానపదగాథ

## అబు, కాడి

పూర్వం ఇస్తాంబుల్‌లో అబు అనే వ్యక్తి ఉండేవాడు. వీధులు ఊడ్చే పని చేస్తూ బతికే అతడు ఎప్పుడూ చాలా సంతోషంగా ఉండేవాడు. వీధుల్లో చెత్త తోస్తున్నప్పుడు తన ముఖంలో తాండవించే సంతోషాన్ని చూసి జనం కొన్ని నాణేలు ఇచ్చేవారు.

ఒక రోజు అబు మరింత సంతోషంగా కనిపించాడు. తను డబ్బు దాచుకుంటున్న కుండను పగులగొట్టి లెక్కించాడు. దాంట్లో మొత్తం ఐదు వందల నాణేలు ఉన్నాయి. దీంతో అబు ఆనందంతో గంతులేశాడు. మరికొంత డబ్బు ఆదా చేసిన తర్వాత తన కుటుంబాన్ని కలవాలని నిర్ణయించుకున్నాడు. కలసి చాలా కాలం కావడంతో వారిని కలిసే క్షణాల కోసం ఎదురు చూడసాగాడు. అయితే ఆ రాత్రి అతడికి దొంగలంటే భయం పట్టుకుంది. ''నా ఇంట్లో ఎక్కడా డబ్బును దాచి పెట్టలేను. మరి ఏం చేయాలి?'' అని ఆలోచించాడు.

ఆ రాత్రంతా అబూ మేలుకునే ఉన్నాడు. నగరంలో ఉన్న జనమంతా కాడి అనే వ్యక్తి గురించి ఘనంగా చెప్పుకోవడం అబుకు గుర్తుకొచ్చింది. సహాయం కోసం అతడిని సంప్రదించాలని అనుకుని, వెంటనే అతడు కాడి ఇంటికి వెళ్లాడు. గేటు ముందు అతడిని చూడగానే కాడి సాదరంగా ఇంట్లోకి ఆహ్వానించాడు.

''నీకేం సహాయం కావాలి?'' అడిగాడు కాడి గడ్డం రాసుకుంటూ.

''సలాం అలేక్కుం సాబ్, నావద్ద అయిదువందల బంగారు నాణేలు ఉన్నాయి. అయితే మా ఇల్లు మంచిది కాదు. వాటిని మీ రక్షణలో ఉంచాలని అనుకుంటున్నాను!''

కాడి తలూపుతూ, ''బంగారు నాణేలు దాచిపెట్టడం నీకు ఎంత ముఖ్యమో అర్థం చేసుకోగలను. నా స్వంత డబ్బులా చూసుకుంటాను!'' అని అబుకు ధైర్యం చెప్పాడు.

అబు అతడికి కృతజ్ఞతలు చెప్పి. తన ఊరికి పోయేముందు నాణేలు తీసుకోవడానికి వస్తానని చెప్పాడు. కాడి మాటల వెనుక అంతరార్థాన్ని గ్రహించలేకపోయిన అబు,





సర్దుకుని ఊరెళ్లడానికి సిద్ధమయ్యాడు. డబ్బుకోసం కాడి వద్దకు వెళ్లేసరికి అతడికి దిగ్భ్రాంతి కలిగింది. ''నువ్వెవరు'' అని ఎదురు ప్రశ్నించాడు కాడి.

''సాబ్. నేను గతంలో మీ వద్ద దాచిన నాణేల సంచీ తీసుకుని వెళ్లడానికి వచ్చాను.'' అన్నాడు అబు తడబడుతూ.

''నన్నే మోసగిద్దామని చూస్తున్నావా? ఇంతకు ముందెన్నడూ నేను నిన్ను చూడలేదు.'' అని చెప్పిన కాడి తలుపు ధడేలున మూసివేశాడు. దాంతో అబు తీవ్ర కోపంతో దహించుకుపోయాడు. కానీ, ఏం చేయగలడు? కాడి గురించి జనం చాలా మంచిగా చెప్పుకుంటుంటారు. పైగా, అతడు కాడికి నాణేల సంచి ఇచ్చినప్పుడు ఎవరూ చూడలేదు కూడా.

అబు నిరాశతో గాఢంగా నిట్టూర్చి, తిరిగి వీధులను ఊడ్చేందుకు వెళ్లాడు. తనవారిని కలుసుకోవడం ఇప్పట్లో సాధ్యమయ్యే పని కాదని అతడికి బోధపడింది.

వీధులూడుస్తుండగా ఒక మహిళ అతడిని చూసి, దగ్గరికి వచ్చింది. ఆమె కాడి పొరుగింటి వ్యక్తి. ''అబూ, నువ్వు ఎల్లప్పుడూ ఆనందంగా ఉంటావు గదా, ఏం జరిగింది? మనసు బాగోలేదా?'' అని అడిగింది. అబు తలూపాడు. ఆగ్రహం, బాధ తన్నుకొస్తుండగా పూసగుచ్చినట్లు జరిగిందంతా ఆమెకు చెప్పాడు. కాడి అంత అన్యాయానికి పాల్పడి

తన మీద పెద్ద భారం తొలిగి పోయినట్లు భావించి, సంతోషంగా అక్కడి నుంచి వెళ్లి ఎప్పటిలాగే పనిచేసుకోసాగాడు.

ఓ రోజు అక్కడికి అతడి స్నేహితుడు తనను చూసేందుకు వచ్చాడు.

''అబూ, నేను మీ ఊరు వెళుతున్నాను. నువ్వు కూడా నాతో రాకూడదా?'' అని అడిగాడు మిత్రుడు. అబు తల అడ్డంగా ఊపి, మరింత డబ్బు సంపాదించాక తన వాళ్లను కలుసుకుంటానని చెప్పాడు. అయితే ఆ మిత్రుడు బలవంతపెట్టాడు. ''నాతో పాటు రా అబు, ఒంటరిగా పోవడం కంటే కలసి పోవటం ఉత్తమం.'' అన్నాడు.

వీధిలో పడిన ఆకులు ఊడుస్తూ అబు కొద్దిసేపు ఆలోచించాడు. అయిదు వందల నాణేలు అంటే ఏమంత చిన్నది కాదు. పైగా భార్యాపిల్లలను కలవాలని అతడి మనసు తహతహలాడింది. దాంతో అతడు దుస్తులు

ఉంటాడని ఆమె నమ్మలేక పోయింది. కానీ అబును ఆమె విశ్వసించింది.

''విను, నేనో పథకం చెబుతా. నేనిప్పుడు కాడి వద్దకు వెళుతున్నాను. కాస్సేపటి తర్వాత నువ్వు కూడా అక్కడికి వచ్చి నీ డబ్బు గురించి అడుగు.'' అని చెప్పింది.

తర్వాత తన సేవకుడిని పిలిచి, అతనితో ''నువ్వు పది నిమిషాల తర్వాత కాడి ఇంటికి వచ్చి, నీ భర్త వచ్చాడని నాకు చెప్పు అని సేవకుడిని పురమాయించింది. సేవకుడికి ఏమీ అర్థం కాకున్నా బుద్ధిగా తలూపాడు.

ఆ మహిళ తన నగల సంచి తీసుకుని కాడిని చూడడానికి వెళ్లింది. కాడి ఆమెను సాదరంగా ఆహ్వానించాడు.

ఆమె చేతుల్లోని సంచికేసి చూస్తూ, ''నేను మీకేం సహాయం చేయగలనమ్మా?'' అని మృదువుగా అడిగాడు.

''నా భర్త ఈజిప్టుకు వెళ్లాడు. ఇప్పటికీ అతడు తిరిగి రాలేదు. నేను అతడిని వెదకడానికి బయలుదేరాలనుకుంటున్నా'' అని ఆమె చెప్పింది.

''అయితే నా నగల గురించి భయపడుతున్నా'' అంటూ, స్వరం తగ్గించి గుసగుసలాడింది. ''ఈ పట్టణంలో విశ్వసనీయ వ్యక్తి ఉన్నారంటే అది మీరే కదా'' అంటూ పొగిడింది. ఆమె సంచిలోంచి నగలు, ఉంగరాలు, హారాలు, వజ్ర కంకణాలు నేలపై పడటంతో అతడి కళ్లు మెరిశాయి. ఆ సమయంలో అబు అక్కడికి వచ్చి, ''సాబ్ మీ వద్దనేను దాచిఉంచిన నాణేలకోసం వచ్చాను'' అన్నాడు. కాడి ముఖం మాడిపోయింది కాని, బలవంతంగా నవ్వు పులుముకుని, ''ఇప్పుడే నీ నాణేల సంచీ తీసుకువస్తాను'' అని చెప్పి లోపలకు వెళ్ళాడు.

నాణేల సంచి తెచ్చి అబుకు అప్పగిస్తూ కాడి ఆమెకేసి తిరిగి అన్నాడు. ''ఈ పట్టణంలో అందరూ తమ వస్తువుల భద్రత విషయమై నన్నే నమ్ముతుంటారు. వాటిని నేను చాలా జాగ్రత్తగా దాస్తుంటాను.'' ఆ క్షణం లోనే ఆమె సేవకుడు పరుగెత్తుకుంటూ వచ్చి ప్రకటించాడు. ''అమ్మా, మీ భర్త వచ్చారు''

ఆమె లేచి చప్పట్లు కొట్టింది. కాడిమొహం కళ తప్పింది. ''సాబ్, కృతజ్ఞతలు. మరొకసారి నా నగలు దాచివుంచవలసిన అవసరం వస్తే తప్పకుండా మీ వద్దకే వస్తాను,'' అని ఆమె అబు కేసి చూసి నవ్వింది. *(పున:కథనం)*

– రమా రమేష్



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


K. SUDARSAN VARMA


K. ARUNA



**Editor, Photo contest, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు జూలై 2010 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.

## అభినందనలు

ఎమ్. ప్రత్యూష,
ఫ్లాట్ నం : 48,
రిజర్వాయర్ కాలనీ,
తిరుపతి -517502
ఆంధ్రప్రదేశ్.

### ఫోటో వ్యాఖ్యల పోటీ:





రెక్కల కష్టం నాది
నీడపట్టు వైభోగం మాది

## చందమామ లోకజ్ఞానం క్విజ్-14 మార్చ్ 2010 సమాధానాలు

1. 9, 2. గురుగ్రహం (జూపిటర్), 3. నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, 4. యురేనస్, 5. రష్యా, 6. కుక్క. లైకా, 7. బుధగ్రహం (మెర్క్యురీ), 8. ప్లూటో.

*గమనిక: సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు గనక బహుమతులు ఇవ్వలేకపోతున్నాము.*

# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు జూలై 2010 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానం పంపిన విజేతకు రూ. 500 బహుమతి ఉంటుంది.

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | 2 | 8 | 1 | | |
| 5 | 9 | | 1 | 4 | | 7 | | 6 |
| | 8 | 4 | | | | | 9 | |
| 6 | | 8 | 2 | 3 | | | | |
| | | 9 | | | 5 | | 3 | 7 |
| | | 3 | | | 4 | 2 | 6 | |
| 8 | | 5 | | 6 | 1 | | | 3 |
| | | | 7 | | 2 | 4 | 1 | |
| 4 | | 1 | | | | | 7 | |

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 6 | | 7 | | | |
| | 2 | | | | | | | 7 |
| | 1 | | | 8 | | 9 | | |
| | | | 2 | | | | 1 | |
| | | 4 | 7 | | 3 | | 2 | |
| 2 | | | | | 4 | | 9 | 5 |
| | 8 | 1 | | 3 | 9 | | | |
| | 3 | 9 | | | 6 | | | |
| | 4 | | | | | | | |

మీ ఎంట్రీలను 2010 మే 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా: **Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093. e-mail your entries to:contests@chandamama.com

మార్చ్ **2010** నెల సమస్యకు సరైన సమాధానం:
ధరలు ఎల్‌బీలలో ఇచ్చినందున కేజీల లెక్కన ఉన్న సరకులను ఎల్‌బీలలోకి మార్చండి.

దశ 1: శ్రేయకు 5 కేజీల బియ్యం అవసరం.

ఎ. కేజీలలోని బరువును 2తో గుణించండి.
5 X 2=10

బి. ఫలితాన్ని 10తో భాగించండి.
10/10=1

సి. రెండు ఫలితాలను కూడండి.
10 ప్లస్ 1=11
5 కిలోలు = 11 ఎల్బీలు

దశ2 : బియ్యం ధర ఎల్బీకి రెండు పౌనులు. కాబట్టి 11 ఎల్బీల బియ్యం ధర
11 X 2=22 పౌనులు

అన్ని సరకులకూ ఈ ప్రక్రియనే కొనసాగించండి. మీరు కింది సమాధానం పొందుతారు.

బియ్యం = 22 పౌనులు
థాయ్ నూడిల్స్ = 6.6 పౌనులు
కూరగాయలు = 26.4 పౌనులు
వాషింగ్ పౌడర్ = 8.8 పౌనులు
చికెన్ = 13.2 పౌనులు
యోగర్ట్ = 4.4 పౌనులు
మొత్తం ఖర్చు = 81.4 పౌనులు

అందుచేత, బిల్లు చెల్లించిన తర్వాత శ్రేయ వద్ద ఉన్న మిగులు = 100-81.4
= 18.6 పౌనులు.

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 16

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 16 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. మే నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. జూలై 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## సూపర్‌మ్యాన్



1. సూపర్‌మ్యాన్ ఏ గ్రహానికి చెందినవాడు?
2. స్పైడర్‌మ్యాన్ తన శక్తులను ఎలా పొందగలిగాడు?
3. కోపం వచ్చినప్పుడు ఏ సూపర్ హీరో తన రంగు మార్చుకుంటాడు?
4. గ్రీన్ గోబ్లిన్, డాక్టర్ అక్టోపస్ ఎవరి శత్రువులు?
5. వండర్ ఉమన్ తాడు చేసే పని ఏమిటి?
6. ఈ సూపర్ హీరో యుద్ధ రాణి
7. క్యాట్ ఉమన్ కూతురు పేరేమిటి?
8. భూమి మీద సూపర్‌మ్యాన్ పేరు ఏమిటి?
9. ఒక సూపర్ హీరో సినిమాలో పాత్రకు గాను ఆస్కార్ అవార్డ్ పొందిన నటుడు వీరిలో ఎవరు?

## యురేకా

# మేకులను నిలబెట్టడం

ఒక మేకు తలపై మీరు పన్నెండు మేకులను నిలబెట్టగలరా? అసాధ్యమే అనిపిస్తుంది కదూ! అయితే దీన్ని చేయడం చాలా సులభం.









ఏమేం కావాలి?

- 13 ఉక్కు మేకులు (8 సెంటీ మీటర్ల పొడవు)
- 4 – సెంటీ మీటర్ల చతురస్రాకారపు కొయ్య దిమ్మె

తయారు చేయడం ఎలా?

- కొయ్య దిమ్మెమీద నిలువుగా మేకును బిగించండి.
- 12 మేకులను చిత్రంలో చూపిన విధంగా అయిదు మేకుల తలలు కుడివైపుకు, అయిదు మేకుల తలలు ఎడమవైపుకు ఉండాలి. మిగిలిన రెండు మేకుల్ని 10 మేకుల తలల మధ్య ఉండేలా అమర్చండి.
- మొదటి, చివరి మేకు గట్టిగా నొక్కి పట్టుకుని మొత్తం మేకులను పైకెత్తి, నిలువుగా ఉన్న మేకుపై ఉంచండి. ఇప్పుడు మేకులు స్తంభాలవలె ఉంటాయి.



- ఆశ్చర్యకరంగా మేకుల సముదాయం పటంలో వలే ఒకే మేకుమీద నిలబడుతుంది. ఈ మేకుల కూర్పు ఎంత స్థిరంగా ఉంటుందంటే మీరు మేకులను అటూ ఇటూ ఊపవచ్చు కూడా.

కాన్సెప్ట్:

బొమ్మలో చూపిన విధంగా మేకులను కూర్చడం వల్ల చక్కగా కలిపిన ఓ అంతర్గత అమరికను తలపిస్తుంది. గది పైభాగాన్ని నిలబెట్టడానికి ఈ అమరిక ఉపయోగపడేది. ఈ అమరిక చాలాస్థిరంగా ఉంటుంది. దీన్ని చేస్తూ చక్కగా మీరు ఆస్వాదించవచ్చు కూడా..

రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ – యూనివర్సిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)

# What's your favourite Ekdum Fresh moment?




It can be a quick dip in the ocean or a dive into the swimming pool or just a cold splash of water. Whatever it is, send us a photo of you or your friends enjoying your favourite Ekdum Fresh moment. And three of the coolest and whackiest photographs will be featured in Chandamama's June issue. All three will also win a year's supply of Bubbaloo Cool Mint. So, go on, show everyone your way of getting Ekdum Fresh.



# జాలరి చెప్పిన సత్యం



గణపవరంలో తిరుపతమ్మ, తిరుపతయ్య అనే దంపతులుండేవారు. తిరుపతయ్య పేదవాడు. గ్రామంలోని రైతుల దగ్గిర కూలి పనులు చేస్తూండేవాడు. తిరుపతమ్మ మాత్రం ఏ పనిపాటులకూ పోక, రోజంతా ఎవరితో ఒకరితో గిల్లికజ్జాలు పెట్టుకునేది. ఇతరుల విషయాల్లో పనిగట్టుకుని కలగజేసుకుని, తన నోటిధాటితో అందరినీ తిట్టి నెగ్గుకొస్తూం డేది. భార్య నోటికి భయపడి తిరుపతయ్య ఆమెనేమీ అనలేక పోయేవాడు.

ఒకరోజు తిరుపతమ్మ గేదె, పక్కింటి రంగయ్య పెంచుకుంటున్న కూరపాదులు తిన్నది. తనకు నష్టం జరిగినా రంగయ్య తిరుపతమ్మ శాపనార్థాలకు భయపడి నోరు మెదపలేదు.

అయినా ఒకసారి ఆమెకు బుద్ధి చెప్పాల నుకుని, కూరపాదులు పెంచిన చోట పిచ్చి మొక్కలు నాటాడు. ఆ మొక్కలు ఏపుగా పెరుగుతుండటం చూసిన తిరుపతమ్మ , అవి పిచ్చిమొక్కలని తెలియక, ఒకరాత్రి వేళ గేదె పలుపు విప్పి, దొంగతనంగా వాటి మీదకు తోలింది. రంగయ్య ఊహించినట్లే, గేదె ఆ పిచ్చిమొక్కలు తిని, మర్నాటి సాయంకాలానికల్లా, కొంతసేపు గురకలు పెట్టి, గిలగిలా తన్నుకుని చచ్చిపోయింది.

రెండు పూటలా చక్కగా పాలిచ్చే గేదె చనిపోవడం చూసి తట్టుకోలేక, తిరుపతమ్మ భర్తతో, ''ఈ ఊళ్లో ఇక మనం బతకలేం. మనం హాయిగా బతికిపోతున్నామని, అంద రికీ కడుపుమంట. అందుకే మన గేదెకు దిష్టిపెట్టో, మంత్రతంత్రాలు ప్రయోగించో చంపారు. ఒక్క క్షణం కూడా మనం ఇక్కడ ఉండద్దు పోదాంపద,'' అన్నది.

''సరే, జరిగిందేదో జరిగింది. మనం గొడవ చేసినందువల్ల లాభమేముంటుంది, వేరే ఊరుకి ఏ నమ్మకంతో ఉన్న ఫళానా పోగలం. ఉన్న ఈ ఒక్క ఆధారం కూడా పోతే ఎలా,'' అన్నాడు తిరుపతయ్య శాంతంగా.

ఆ మాటలకు తిరుపతమ్మ శాంతపడక పోగా, మరింత రెచ్చిపోయి, ''ఇది ఊరు కాదు. వల్లకాడు. వల్లకాటివాసం నేనొప్పను. రేపుదయానే బయలుదేరి, మా పుట్టింటికి వెళదాం. అక్కడ నీకు కూలిపని దొరక్కపోదు. రావడం నీకు ఇష్టం లేకపోతే చెప్పు నా దారి నేను చూసుకుంటా. తర్వాత ఊరికి నువ్వే కావిలి ఉండు.'' అన్నది పెడసరంగా.

భార్య మాటకు ఎదురు చెప్పలేని తిరుపతయ్య, మర్నాటి ఉదయాన ఆమెను వెంటబెట్టుకుని బయలుదేరాడు. వాళ్లు ఊరునానుకుని ఉన్న చెరువు దగ్గిరకు రాగానే, అక్కడ రెండు గాలాలతో చేపలు పడుతూ, జాలరి జంగయ్య కనిపించాడు. ఆ సమయంలో అతను ఒక చేపను గాలం నుంచి లాగి బుట్టలో వేస్తున్నాడు.

తిరుపతమ్మ అది చూసి కళ్లింతచేసి, ముక్కున వేలేసుకుని, ''రెండు చేతులా సంపాయించడమంటే, ఇదేకాబోలు! ఎడ నొకగాలం, పెడనొకగాలం. ఈ జంగయ్య చెరువుగట్టున కడుపులో చల్ల కదలకుండా కూర్చుని, చేపలను ఒడ్డుకు లాగుతూ, మన బోటివాళ్లకు బోలెడు ధరకు అమ్ముతున్నాడు. జానెడు కూడా లేని, ఆ చేప ఖరీదు ఎంత చెబుతాడో చూస్తాను.'' అంటూ బుట్టలో చెయ్యి పెట్టింది.

అయితే, ఆ బుట్టలో అప్పటికే చేపలతో పాటు కొన్ని ఎండ్రకాయలున్నవి. అందులో కాకమీద ఉన్న ఎండ్రకాయ ఒకటి తిరుపతమ్మ వేలును గిట్టలతో పట్టుకుని గట్టిగా కరిచింది.



ముందూ వెనకా ఆలోచించకుండా చేపల బుట్టలో చెయ్యి పెట్టి ఎండ్రకాయతో కరిపించుకున్న తిరుపతమ్మ బాధకు తాళలేక జంగయ్యను, ''నీవేనా జాలరివాడివి! ఎండ్రకాయల్నీ, చేపల్నీ ఒకే బుట్టలో వేస్తావా? బుద్ధి లేదూ నీకు?'' అంటూ తిట్లు ప్రారంభించింది.

జాలరి జంగయ్య, ఆమెను కోపం తగ్గే వరకు తిట్టుకోనిచ్చి, ''అమ్మా, ఈ చేపలూ, ఎండ్రకాయలూ, ఈ చెరువు నీళ్లలోనే దొరికినై. అవి నీళ్లలో కలిసి ఉన్నట్లే, బుట్టలో కూడా కలిసి ఉన్నై. మిగతా చేపల్లా నోరు మూసుకుని ఉంటే, ఈ బుట్టలోని చేపలు చెరువులోనే నిక్షేపంగా ఉండేవి: ఎరలకు ఆశపడి ప్రాణాలమీదికి తెచ్చుకున్నవి.'' అన్నాడు.

జాలరివాడి సమాధానంతో ఆమెకు మరింత కోపం వచ్చింది. నీ చేపల సోదె అంతటితో

ఆపు! నా వేలిని గిట్టలతో పట్టింది ఎండ్ర కాయ! అన్నది తిరుపతమ్మ కసిగా,

జంగయ్య పక్కున నవ్వి, ''గిల్లితగువులు పెట్టుకోవడం కొందరి నైజగుణం. ఎండ్ర కాయ కూడా వాళ్ల లాంటిదే. అది నీళ్లలో ఉన్నా, బయటఉన్నా, దాని గుణం మారదు. అయినా, ఒక చిన్నమాట! నువ్వు బుట్టలో చెయ్యిపెట్టి దాన్ని రెచ్చగొట్టడం ఎందుకు? తీరా కరిచాక జాలరివాడి మీద విరుచుకు పడ్డం ఎందుకు?'' అని అడిగాడు.

తిరుపతయ్యకు పుట్టి పెరిగిన ఊరు విడిచిపెట్టాలని లేదు. అతడు భార్యతో ''జంగయ్య చెప్పిన సత్యం, నువ్వు గ్రహించావా? ఎండ్రకాయలాగే బుద్ధిమారనంత వరకూ, మనం గణపవరంలో ఉన్నా, రామ వరంలో ఉన్నా తోటి మనుషులు మనని అసహ్యించుకుంటూనే ఉంటారు. మనం ఒకరి జోలికి వెళ్ళకుంటే ఇతరులు కూడా మన జోలికి రారు. దానికి ఎండ్రకాయ కాటే ఉదాహరణ కదా! నువ్వు ఎండ్రకాయ జోలికి వెళ్లబట్టే, అది గిట్టలతో నీ వేలును పట్టు కున్నది. అవునా?'' అన్నాడు.

''కాక మరేమిటి? ఇంకా వేలినొప్పి వదలందే,'' అన్నది తిరుపతమ్మ.

''అయితే, నే చెప్పేది శాంతంగా విను. జాలరి జంగయ్య కాస్త గూఢంగా చెప్పిన దేమంటే.. నోరు మంచిదైతె, ఊరు మంచి దవుతుందని! ఈ ఊళ్లో ఇన్నాళ్లుండి, ఏ గొడవలూ లేకుండా బతకలేనివాళ్లం. మరొక కొత్త ఊళ్లో మాత్రం బతగగలమా? ముందు, మన బుద్ధులు మారాలి. ఏమంటావు?'' అన్నాడు తిరుపతయ్య.

భర్త మందలింపును అర్థం చేసుకున్న తిరుపతమ్మ కొంచె ఆగి, ''ఏమనేందుకేము న్నది? పద, ఇంటికి తిరిగిపోదాం. ఎండ్ర కాయ తన గుణం మార్చుకోలేదేమో గాని, మనిషినైన నేను మార్చుకుని, నలుగురి తోనూ మంచిగా ఉండగలను. మనిషికి, ఎండ్రకాయకు గల తేడా ఏమిటో చూపి స్తాను!'' ఆ సంగతి వారం తిరక్కుండానే, నువ్వే గ్రహిస్తావు. అన్నది.

భార్యలో వచ్చిన మార్పు చూసి తిరుప తయ్య ఎంతో ఆనందించాడు.

– ఎం.డి.సౌజన్య





# అహంకారి

ఒక వృద్ధ రాజు, కొన్ని టీకా తాత్పర్య గ్రంథాల సాయంతో భగవద్గీతను చదివి, దాన్ని పద్య రూపంగా రాశాడు. పని ముగియగానే, ఆయనకు తనంత గొప్ప కవి లేడన్న అహంకారం కలిగింది. అహం ప్రవేశించిన తర్వాత మనిషిని ఇక పట్టలేం కదా! రాజ్యంలో కెల్లా గొప్ప కవీ, పండితుడైన విష్ణుశర్మకు ఆయన కబురు చేస్తూ, తనతో సరితూగగల కవిని తన వద్దకు పంపవలసిందిగా ఆదేశించాడు.

విష్ణుశర్మ ఒక యువకుడిని రాజు వద్దకు పంపాడు. రాజు అతడితో ''నువ్వేదో పిల్లకవివై ఉంటావు. భగవద్గీత నా వంటివాడికే అర్థం కాక, టీకాతాత్పర్యాలు చదవవలసి వచ్చింది. పద్యరూపంలో ఉన్న నా కవిత్వం, నీకేం అర్థమవుతుంది! వెళ్లి నీ గురువునే పంపు, నీకేం తెలుసని ఇక్కడికి వచ్చావు.'' అన్నాడు విసుగుపడుతూ.

కొద్ది రోజుల తర్వాత విష్ణుశర్మ స్వయంగా వచ్చాడు. రాజు ఆయనతో యువకుడి గురించి చెప్పాడు. అప్పుడు విష్ణుశర్మ, ''మహారాజా, మీరు భగవద్గీతను అర్థం చేసుకోవడానికి చదివిన టీకా తాత్పర్య గ్రంథాలు, నేనిచ్చినవే గదా! అవి రాసింది ఆ యువకుడే'' అన్నాడు.

రాజుకు అది విని మతిపోయినట్లయింది. విష్ణుశర్మతో, ''మరి ఆ సంగతి ఆ యువకుడు నాకు చెప్పలేదేం? అతనంత గొప్ప కవా?'' అని అడిగాడు.

అందుకు విష్ణుశర్మ, ''నిజమైన కవీ, పండితుడూ తనను గురించి గొప్పగా చెప్పుకోడు, మహారాజా!' అన్నాడు.

ఆ జవాబుతో వృద్ధరాజుకు అహంకారం వదిలిపోయింది.

– ఎం.డి.సౌజన్య





# 25 ఏళ్ళనాటి చందమామ కథ

## చిక్కుముడి

నివారణలేని వ్యాధితో బాధపడి తండ్రి మరణించగానే, గిరిబాబు లోకంలో ఒంటరివాడై పోయాడు. అతడు ఉన్న కొద్ది పాటి పొలాన్ని అమ్మి, తండ్రి చికిత్స కోసం చేసిన అప్పులు తీర్చివేసి, పట్నం వెళ్లి, ఏదైనా ఉద్యోగం సంపాయించుకోవాలని బయలుదేరాడు.

దారిలో గిరిబాబు ఒక చిన్న గ్రామం దాటి కొంత దూరం వెళ్లగానే, బాట పక్కన ఓ చెట్టునీడలో కూర్చుని ఉన్న ముసలివాడొకడు కనిపించి, అతడితో, ''పట్నం వెళుతున్నావా బాబూ? నేనూ అక్కడికే వెళుతున్నాను. బాడుగబండి కోసం ఇక్కడ ఆగాను. నువ్వూ, నాతో పాటు తోడుగా వస్తే కాస్త ధీమాగా ఉంటుంది. నేను గుండె జబ్బు మనిషిని!'' అన్నాడు. అప్పటికే నడకభారం గిరిబాబుకు చాలా అలసటగా అనిపించింది. బాడుగబండి అనగానే ఉత్సాహంతో అతడు ఏదో అనబోయేంతలో, ముసలివాడు, ''మరోలా అనుకోకు బాబూ, బాడుగ బండికయ్యే ఖర్చు నాదే, ఈ మధ్య గుండె జబ్బుతో పాటు, ఇతరత్రా గొడవల వల్ల, నాలో పిరికితనం పాలు పెరుగుతున్నది. అందుకే నిన్ను కాస్త సాయంగా వెంట రమ్మంటున్నాను,'' అన్నాడు.

''ఇంత చెప్పాలా, తాతా! ఇద్దరం కలిసే వెళదాం,'' అన్నాడు గిరిబాబు. కొంతసేపటికి అటుగా ఒక బాడుగ బండి వచ్చింది. ముసలివాడు బండి వాడితో బాడుగ సంగతి మాట్లాడి, గిరిబాబుతో, ''ఏమీ అనుకోక, ఈ పక్కన ఉన్న పెట్టెను కాస్త బండిలో పెట్టు, బరువులు ఎత్తవద్దని వైద్యులు చెప్పారు;'' అన్నాడు. ఆ సమయంలో బండివాడు, కొంచెం దూరంలో కనిపించిన పచ్చిగడ్డి కోసి తన ఎద్దుకు వేయడానికి వెళ్లాడు. వాడు తిరిగి రాగానే గిరిబాబు పెట్టెను బండిలో పెట్టి, ముసలివాడికి చేయి





ఆసరా ఇచ్చి బండిలో ఎక్కించాడు. బండి పట్నం పొలిమేరలు సమీపించే సరికి సూర్యాస్తమయ వేళ కావస్తున్నది.

పట్నం ప్రధానవీధిలోకి బండి రాగానే, ఇద్దరు రక్షకభటులు బండిని ఆపి, ''ఎక్కడి నుంచి వస్తున్నారు? మీ వెంట ఉన్న సామాను సోదా చేయాలి,'' అన్నారు. ఆ మాటలు వింటూనే ముసలివాడు వెలవెలపోతూ, ''అయ్యా, నేను గుండె జబ్బు మనిషిని, వైద్యం కోసం పట్నం వచ్చాను. నన్ను త్వరగా వెళ్ళనియ్యండి.'' అన్నాడు. ''మీ సామాను పరీక్షించడం పూర్తవగానే, మీరు హాయిగా వెళ్లొచ్చు,'' అంటూ రక్షకభటులు బండీ లోంచి పెట్టెను కిందికి దించి, తాళపు చెవి ఇవ్వమని అతడిని అడిగారు.

ముసలివాడు వెంటనే, ''ఈ పెట్టె నాది కాదు, బాబూ, ఈ కుర్రాడిది,'' అని, ఆ జవాబుకు ఆశ్చర్యపోయి చూస్తున్న గిరి బాబును కోపంగా, ''అలా గుడ్లు మిటక రించి చూస్తావేం? తాళపు చెవి అడుగుతు న్నారు గదా, ఇవ్వు,'' అన్నాడు.

''తాళపుపెట్టె చెవి, నా దగ్గర ఉండటం ఏమిటి?'' అన్నాడు గిరిబాబు మరింతగా ఆశ్చర్యపోతూ. ''నీ పెట్టెతాళం, నీదగ్గరకాక మరెక్కడుంటుంది?'' అన్నాడు ముసలి వాడు చిరాగ్గా. అంతలో బండివాడు, ''ఆ తాళపు చెవేదో వారికి త్వరగా ఇవ్వండి. నేను మిమ్మల్ని ఇక్కడ దించి తిరిగి వెళ్లి పోవాలి.' అన్నాడు గిరిబాబుతో. పెట్టెను గిరిబాబు బండిలో పెట్టడం చూసిన బండివాడు, ఆ పెట్టె అతడిదే అనుకున్నాడు.

గిరిబాబు ఏమి చేయాలో తోచక దిగాలు పడిపోయాడు. రక్షక భటులు విసుక్కుంటూ పెట్టెతాళం బద్దలు కొట్టారు. పెట్టెలో చాలా పాత బట్టలున్నవి. వాళ్లు వాటిని తొలగించి చూడగా, అడుగున ఒక మూట కనిపిం చింది. వాళ్లు ఆ మూట విప్పారు. అందులో చాలా బంగారు నగలు కనిపించినై. రక్షక భటులిద్దరూ, గిరిబాబు మెడ పట్టుకుని, ''ఓరీ, ఆరి తేరిన దొంగా! పాత బట్టల అడు గున దాస్తే మాత్రం, దొంగసొత్తు దాగుతుందా? పోలవరం జమీందారు గారింటిని దోచిన ఘనుడివి, నువ్వేనన్నమాట,'' అన్నారు.

గిరిబాబు వడవడ వణికిపోతూ, ''అయ్యా నేను దొంగను కాను. ఈ పెట్టె నాది కాదు. ఈ ముసలాయనది. నా మాట నమ్మండి!'' అన్నాడు. ముసలివాడు రౌద్రంగా, ''ఎవడి విరా నువ్వు! నామీద దొంగతనం మోపు



ఆ రాత్రి కొత్వాలు భోజనం చేస్తూ, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూండటం గమనించిన అతడి భార్య సంగతేమని అడిగింది. కొత్వాలు జరిగించి చెప్పి, ''ఇంత కాలంగా ఉద్యోగం చేస్తున్నాను, ఏనాడూ ఇంత చిక్కుముడి ఎదురవలేదు,'' అన్నాడు. కొత్వాలు భార్య కొంచెంసేపు ఆలోచించి, ''ఇది ఏదో చిక్కు ముడి అన్న భ్రమతో పెద్దగా ఆలోచిస్తూ చిక్కులో పడ్డారు. ఇలా చెయ్యండి!'' అని ఆ చేయవలసిందేమిటో భర్తకు చెప్పింది. కొత్వాలు మర్నాడు కచేరీకి వెళుతూనే గిరి బాబును పిలిపించి, ''మా వాళ్లు పొరపా టున నిన్ను పట్టుకువచ్చారు. జమీందారు గారి ఇల్లు దోచిన దొంగ, పట్టుబడినట్లు సమాచారం అందింది. నువ్వు వెళ్ళవచ్చు!'' అని ముసలివాడి పెట్టెను గిరిబాబు చేతికి ఇవ్వబోయాడు. పెట్టెను చూస్తూనే గిరి బాబు భయపడిపోతూ, ''అయ్యా, ఇది నాదికాదు, ఆ ముసలాయనదని మనవి చేసుకున్నాను. దీన్ని నాకిస్తారెందుకు?'' అన్నాడు.

''బాడుగ బండివాడి సాక్ష్యం ప్రకారం కూడా, ఇది నీదే! ఎవళ్ళ సొత్తు వాళ్ళకు అందజేయడం, మా విధి. ఇక వెళ్ళు.'' అన్నాడు కొత్వాలు కరుకుగా. ముందు అక్కడినుంచి బయటపడి తరవాత ముసలి వాడికి పెట్టెను ఇవ్వవచ్చు ననుకుంటూ, గిరిబాబు పెట్టెతో సహా అక్కడి నుంచి బయలు దేరాడు. గిరిబాబు అటుపోగానే, కొత్వాలు ముసలివాణ్ణి పిలిపించి, ''నిర్దోషు లైన మిమ్మల్ని అనవసరంగా అనుమా

తావా? నా వయసు చూసయినా మర్యా దగా మాట్లాడటం నేర్చుకో,'' అన్నాడు. ఇదంతా చూసి రక్షకభటులు ''మీలో ఎవరు నిజం చెబుతున్నారో, ఎవరు అబద్ధం చెబు తున్నారో తెలియడం లేదు. అందరూ ముందు కొత్వాలు దగ్గిరకు రండి,'' అని వాళ్ళను కొత్వాలు దగ్గరకు తీసుకుపోయారు.

కొత్వాలు బండివాణ్ణి బాగా ఎరుగును. అందువల్ల ఆయన వాణ్ణి వెళ్లి పొమ్మన్నాడు. తరవాత ముసలివాణ్ణి, గిరిబాబునూ ప్రశ్నిం చగా, వాళ్ళు పూర్వం లాగే పెట్టె మాది కాదంటే మాది కాదని జవాబివ్వసాగారు.

ఆయన వాళ్లిద్దరినీ కచేరీ గదుల్లోనే ఉంచ మని రక్షకభటులకు చెప్పి, ముసలాడూ, గిరిబాబులతో, ''మీలో ఒకడు ఆరితేరిన గజదొంగ. రేపు ఉదయం ఆ సంగతి తేల్చు తాను,'' అని ఇంటికి వెళ్ళిపోయాడు.

నించాం. మీరు, ఆ కుర్రవాడూ దొంగలు కాదని తెలిసింది. ఆ పెట్టెను కుర్రవాడి కిచ్చి పంపేశాను. మీరూ వెళ్ళవచ్చు,'' అన్నాడు.

పెట్టె తీసుకుని గిరిబాబు వెళ్ళిపోయాడని విని, ముసలివాడు నిరాశపడిపోయి, ఎలాగయినా వాణ్ణి పట్టుకోవాలనుకుంటూ బయలుదేరాడు. అతడికి వీధి మలుపు తిరగగానే, ఒక ఇంటి అరుగుమీద పెట్టెతో సహా కూర్చుని ఉన్న గిరిబాబు కనిపించాడు. ముసలివాడు చప్పున పోయి, పెట్టెను తీసుకుని, ''ఒరే కుర్రవెధవా! పదివేల ఖరీదు చేసే నగలు తేరగా పట్టుకుపోదాం అనుకున్నావా?'' అన్నాడు.

గిరిబాబు ఏమీ తొణక్కుండా, ''నీ పెట్టె నీకు ఇచ్చిపోదామనే ఇక్కడ కూర్చున్నాను. కొత్వాలు ఇందులో ఉన్నది దొంగ సొత్తు కాదన్నాడు. అయినా ఈ పెట్టె నీది కాదని రక్షక భటులకూ, ఆయనకూ ఎందుకు చెప్పావో అర్థం కావడం లేదు. ఇక ఎవరి దారి వారిది. ముందు నేనెక్కడైనా చిన్న ఉద్యోగం సంపాయించుకోవాలి,'' అంటూ అరుగు మీదినుంచి కిందికి దిగాడు.

అంతలో వెనక నుంచి వస్తున్న కొత్వాలు, ముసలివాడిని, ''గుండెజబ్బు తాతగారూ, కాస్త ఆగండి! ఈ పెట్టెలో నగలు లేవు. ఉన్నవి పాతబట్టలు!'' అని కేకవేసి, అతణ్ణి కొంచెం వెనకగా వస్తున్న రక్షకభటులకు చూపుతూ, ''ఈ ముసలాడు గజదొంగ. పెట్టెలో దొరికినవి, వీడు జమీందారు గారి ఇంట తస్కరించిన నగలే. వీణ్ణి ముందు ఖైదులో పెట్టండి.'' అని ఆజ్ఞాపించాడు.

గిరిబాబు నిర్ఘాంతపోయి, ''అసలు దొంగ దొరికాడన్నమాట! నేను నిర్దోషినని ఇప్పటికి తమకు పూర్తి నమ్మకం కలిగినందుకు సంతోషంగా ఉన్నది,'' అన్నాడు.

కొత్వాలు అతడి ముందుకు వచ్చి, భుజం తట్టి, ''నీ నిర్దోషిత్వమే కాదు, నీ నిజాయితీ కూడా రుజువయింది. మా కచేరీలో ఉద్యోగం ఇస్తాను. ఇష్టమేనా?'' అని అడిగాడు.

''అంతకన్న కావలిసిందేమున్నది! తమ దయకు చాలా కృతజ్ఞుణ్ణి,'' అన్నాడు గిరిబాబు ఆనందంగా.

– మాచిరాజు కామేశ్వరరావు



# భారత దర్శిని

## చేతబడిని తిప్పికొట్టే ఆలయం




చేతబడికి విరుగుడు కోసం తమిళనాడు పొల్లాచ్చి సమీపంలోని మసానియమ్మ ఆలయానికి ప్రజలు వెల్లువెత్తుతుంటారు. భక్తుల కోరికలను ఈ దేవత మూడు వారాల్లోనే తీరుస్తుందని జనం నమ్మిక.

దీనిపై ఓ కథ ప్రచారంలో ఉంది. పొల్లాచ్చి సమీపంలో అన్నైమలై అనే ప్రాంతం ఉంది. ఒకప్పుడు నానన్ అనే క్రూర చక్రవర్తి ఈ ప్రాంతాన్ని ఏలేవాడు. అతడి ఉద్యానవనంలో ఓ అద్భుతమైన మామిడి చెట్టు ఉండేది. కానీ పళ్లను తినడానికి అతడు ఎవరినీ అనుమతించేవాడు కాదు. ఓసారి ఒకమ్మాయి ఈ చెట్టు పండు కోసుకుని తిన్నది. ఆగ్రహించిన నానన్ రాజు ఆమెకు మరణశిక్ష విధించాడు. ఈ బాలిక జ్ఞాపకార్థం ఆమె సమాధి మీద స్త్రీ విగ్రహాన్ని నిర్మించారు. అప్పటినుంచి ఈ విగ్రహం మసాని దేవతగా పూజలందుకుంటోంది.

## గిరిజన మహిళా బ్యాంకు

బ్యాంకు నిర్వహించడం సులభం కాదు. కదా? కాని బ్యాంకును నడిపే విషయంలో జార్ఖండ్ గిరిజన మహిళలకు ఓ దారి దొరికినట్లయింది! సంతాలి మహిళల బృందం జార్ఖండ్ లోని గిర్ధ్ జిల్లా బెంగాబాద్‌లో ఓ చిన్న బ్యాంకును తెరిచారు.

చీటికీ మాటికీ కసురుకునే బ్యాంకు ఉద్యోగుల వైఖరితో విసిగిపోయిన వీరు బ్యాంక్ పనులను తమ చేతుల్లోకి తీసుకోవాలని నిర్ణయించారు. త్వరలోనే ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రూరల్‌మేనేజ్‌మెంట్,ఆనంద్ (ఐఆర్ఎమ్ఎ)సహాయంతో గ్రామీణ బ్యాంక్ ప్రారంభించబడింది.




పలువురు గిరిజన మహిళలు తమ నగదు ఐఎఫ్ఐసిసిఓ బ్యాంక్‌లో డిపాజిట్ చేశారు. సామూహిక జ్ఞానం ద్వారా ఈ మహిళలు తమ జీవనశైలిని మార్చుకోవడానికి చేసిన ఈ ప్రయత్నం నిజంగా ప్రశంసనీయమైంది!



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను-చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Where are you going? | What do you want to eat? |
|---|---|---|
| Telugu | మీరు ఎక్కడికి వెళుతున్నారు? | మీరు ఏం తినాలనుకుంటున్నారు? |
| Hindi | तुम कहाँ जा रहे हो?<br>తుమ్ కహాఁ జా రహే హో? | तुम क्या खाना चाहते हो?<br>తుమ్ క్యా ఖానా చాహతే హో? |
| Tamil | எங்கே செல்கிறீர்கள்?<br>ఎంగే సెల్‌కిరీర్‌గళ్? | என்ன சாப்பிட விரும்புகிறீர்கள்?<br>ఎన్నా సాప్పిడ విరుంబుకిరీర్‌గళ్? |
| Bengali | তুমি কোথায় যাচ্ছ?<br>తుమి కోత్తాయీ జాచ్చో? | তুমি কি খেতে চাও?<br>తుమి కి కేటే చావో? |
| Marathi | आपण कोठे जाताय?<br>ఆపన్ కోటే జాతాయ్? | आपल्याला खाण्यात काय आवडेल?<br>ఆప్‌ల్యాలా ఖాన్యాత్ కాయ్ ఆవడేల్? |
| Kannada | ನೀವು ಎಲ್ಲಿಗೆ ಹೋಗುತ್ತಿರುವಿರಿ?<br>నీవు ఎల్లిగె హోగుత్తిరువిరి? | ನೀವು ಏನು ತಿನ್ನಲು ಬಯಸುತ್ತೀರಿ?<br>నీవు ఏను తిన్నలు బయసుత్తీరి? |
| Oriya | ତୁମେ କୁଆଡେ ଯାଉଛ ?<br>తుమ్ క్వాడే జాచ్చా? | ତୁମେ କଣ ଖାଇବାକୁ ଚାହୁଁଛ ?<br>తుమే కానా ఖాల్బాకు చహుంచా? |
| Gujarati | તમે ક્યાં જાવ છો?<br>తమే క్యాం జావ ఛో? | તમને શું ખાવાનું ભાવશે?<br>తమనే షుం ఖావానుం భావషే? |
| Assamese | আপুনি কোনফালে যায়?<br>ఆపుని కోన్‌ఫాలే జాయ్? | আপুনি কি খাব বিচাৰিছে?<br>ఆపుని కి ఖాబ్ బిసారిసే? |
| Malayalam | നിങ്ങൾ എവിടേക്കാണ് പോകുന്നത്?<br>నీన్‌గల్ ఎవిడెకాను పోకున్నథు? | നിങ്ങൾക്ക് എന്താണ് കഴിക്കാൻ വേണ്ടത്?<br>నీంగలక్కు ఎంథానూ కళిక్కాన్ వెన్‌డథు? |
| Santali | ᱚᱠᱟ ᱴᱮᱵᱤᱱ ᱥᱮᱱᱚᱜ ᱠᱟᱱᱟ?<br>ఓకా టెబిన్ సెనోగ్ కానా? | ᱪᱮᱫ ᱡᱟᱢ ᱥᱟᱱᱟ ᱤᱫ ᱵᱤᱱᱟ?<br>చెద్ జామ్ సన్నా ఇద్ బీనా? |
| Sanskrit | त्वम् कुत्र गच्छसि?<br>త్వమ్ కుత్రా గచ్ఛసి? | त्वम् किम् खादितुम् इच्छसि?<br>త్వమ్ కిమ్ ఖాదితుమ్ ఇచ్ఛసి? |





| English | Please wait here. | How far is the school from here? |
|---|---|---|
| Telugu | దయచేసి ఇక్కడ వేచివుండండి. | ఇక్కడి నుంచి పాఠశాలకు ఎంతదూరం? |
| Hindi | कृपया यहाँ प्रतीक्षा करें।<br>కృపయా యహాఁ ప్రతీక్షా కరేం. | यहाँ से स्कूल कितनी दूर है?<br>యహాఁ సే స్కూల్ కితనీ దూర్ హై? |
| Tamil | தயவுசெய்து இங்கு காத்திருங்கள்.<br>దయవుసెయ్‌దు ఇన్‌గు కాత్తిరున్‌గల్. | இங்கிருந்து பள்ளி எவ்வளவு தூரத்தில் உள்ளது?<br>ఇన్‌గీరున్‌దు పల్లీ ఎవ్వళవు దూరత్తిల్ ఉళ్లదు? |
| Bengali | দয়া করে এখানে অপেক্ষা করো।<br>దయా కొరే ఎఖానే ఆపెక్షా కరో. | স্কুলটা এখান থেকে কতো দূর?<br>స్కూల్‌టే ఎఖాన్ థెకె కటో దూర్? |
| Marathi | कृपा करून इथे वाट बघा.<br>కృపా కరున్ ఇథే వాట్ భఘా. | इथून शाळा किती लांब आहे?<br>ఇథూన్ షాళా కితీ లాంభ ఆహె? |
| Kannada | ದಯವಿಟ್ಟು ಇಲ್ಲಿ ಕಾಯಿರಿ.<br>దయవిట్టు ఇల్లి కాయిరి. | ಇಲ್ಲಿಂದ ಶಾಲೆ ಎಷ್ಟು ದೂರವಿದೆ?<br>ఇల్లింద శాలె ఎష్టుదూరవిదె? |
| Oriya | ଦୟାକରି ଏଠାରେ ଅପେକ୍ଷା କରନ୍ତୁ ।<br>దయా కరి ఎథారే అపేక్షా కరంతు. | ଶିକ୍ଷକଙ୍କ ସ୍କୁଲ କେତେ ଦୂର ?<br>ఎథారూ  స్కూల్ కేటే దూర్? |
| Gujarati | કૃપા કરી અહીં રાહ જુઓ.<br>కృపా కరీ ఆహీం రాహ జూఓ. | અહીંથી શાળા કેટલી દૂર છે?<br>ఆహింథీ శాలా కేటలీ దూర్ ఛే? |
| Assamese | অনুগ্ৰহ কৰি ইয়াত অপেক্ষা কৰক।<br>అనుగ్రహ కరి ఏయాట్ అపెక్కా కర్‌కా. | ইয়াৰ পৰা স্কুলখন কিমান দূৰত?<br>ఇయార్ పరా స్కూఖన్ కిమాన్ దూరట్? |
| Malayalam | ദയവായി ഇവിടെ കാത്തുനിൽക്കുക.<br>దయవాహి ఇవిడ కాథునిక్కుక. | ഇവിടെ നിന്ന് സ്കൂൾ എത്ര അകലെയാണ്?<br>ఇవిడే నిన్ను స్కూల్ ఎత్రా అకలీయాను? |
| Santali | ᱱᱚᱸᱰᱮ ᱛᱟᱹᱝᱜᱤ ᱤᱧ ᱵᱤᱱ।<br>నొండె తంగి ఇన్‌జ్ బీన్. | ᱱᱚᱸᱰᱮ ᱠᱷᱚᱱ ᱟᱥᱤᱭᱟᱹ ᱴᱤᱱᱟᱹᱜ ᱥᱟᱸᱜᱤᱡᱟ?<br>నొండె ఖోన్ అషియా టినాగ్ సాంగ్లిజా? |
| Sanskrit | कृपया अत्र प्रतीक्ष।<br>కృపయా అత్ర ప్రతీక్ష. | इत: पाठशाला कियत् दूरम् अस्ति?<br>ఇతః పాఠశాలా కియత్ దూరమ్ అస్తి? |

## వేగసూత్రం ఫలితాలు

మార్చి 2010 సంచిక వేగసూత్రంకు మీరు పంపించిన సమాధానాలకు కృతజ్ఞతలు. సరైన సమాధానాలు రానందున, బహుమతి ప్రకటించడం లేదు.



# మన చరిత్ర పుటల నుంచి

## సమస్య

కలకత్తా, 1878 మార్చి 5.

అతడు చిరిగిపోయిన కాగితం ముక్క కేసి చూశాడు. అందులో ''ఈ జీవితాన్ని కొనసాగించడంలో అర్థంలేదు. ఎందుకంటే మన మాతృభూమికి ఇది ఏ మేలూ చేయడం లేదు.'' అని రాసి ఉంది.

ఈ పదాలు రాసి చాలా కాలమయ్యింది. కానీ వాటి వెనుక ఉన్న బాధ, ఆవేదనను అతడు చాలాకాలంగా అనుభవిస్తున్నాడు. అప్పుడే గదిలో అడుగు పెట్టిన నబీన్ చంద్ర బోస్, ''ఇలా ఎంతకాలం అక్కడ కూర్చుని కాగితం ముక్కను చూస్తుంటావు?'' అని శిశిర్ కుమార్ ఘోష్‌తో అన్నాడు.



శిశిర్ వెనక్కు తిరిగి చూసి ''నబిన్! నిన్ను ఇక్కడ చూడటం చాలా సంతోషంగా ఉంది'' అన్నాడు.

నబిన్ లోపలికి వచ్చి తన మిత్రుడి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని. ''ఒక ఉత్తరాన్ని వెయ్యిసార్లు చదివినా అతడిని వెనక్కు తీసుకురావడం కష్టం. అలా జరిగితే బాగుంటుందని నేననుకున్నా, కాని అలా జరగదు,'' అని అన్నాడు.

''అతడు బతికే ఉన్నట్లయితే, బ్రిటిష్ పాలనలో ఇంకా మగ్గుతున్న మనల్ని చూసి నా సోదరుడు తీవ్రంగా ద్వేషించేవాడు,'' అని శిశిర్ చెప్పాడు విచారంగా.

''అతడి మరణం వృధా కాదు. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా నీ పత్రిక ద్వారా చేయవలసిందంతా చేస్తూనే ఉన్నాం కదా.''

''అమృతబజార్ పత్రిక ఆగిపోయే దశకు వచ్చేసింది నబీన్. లార్డ్ లిట్టన్ అతడి ప్రాంతీయ భాషల పత్రికా చట్టం దాని అంతానికి పని కట్టుకున్నాయి. బెంగాలీలో స్వేచ్ఛా భావనతో, స్వతంత్రంగా మనం ఇకపై ఏమీ ప్రచురించలేము. మన పత్రికను దృష్టిలో పెట్టుకునే ఈ చట్టం వచ్చింది. వాళ్లు క్షణాల్లో మనలను నిర్బంధించగలరు. బిజయ్ ప్రింటింగ్



ప్రెస్‌ను వాళ్లు మూసివేసిన విషయం నీకు తెలుసా?

నబీన్ ముఖంలో దిగ్భ్రాంతి చోటు చేసుకుంది. ''అంతా ముగిసినట్లేనా శిశిర్..? మన పని మొత్తంగా ఆగి పోయినట్లేనా?''

***

పోలోమగురా, జెస్సోర్ జిల్లా. బెంగాల్ ప్రావిన్స్, క్రీ.శ. 1868 డిసెంబర్ 20

''నబిన్, దీనికేసి చూడు. నీవేమ నుకుంటున్నావు,'' అంటూ శిశిర్ ఓ పేపర్ తీసుకుని పరుగెత్తి వచ్చాడు.

నబిన్ పరధ్యానంగా కాగితం అందు కుని, ''నా కవితలను తిరగ రాస్తు న్నాను - ఏమిటది?''

''సంపాదకీయం'' అన్నాడు శిశిర్.

బెంగాలీలో ఉన్న పాఠంపై నబిన్ చూపు మరలింది. ''ఇంగ్లీష్ వారి నియంతృత్వాన్ని అడ్డుకోడానికి బెంగాలీలు కృతనిశ్చయులై ఉన్నారు.'' శిశిర్ మాటకు అక్కడున్న హరి నారాయణ్ ఈల వేశాడు.

''భలే, తప్పకుండా జరుగుతుంది...'' సరైన పదం కోసం ఆలోచిస్తున్న హరి కాసేపు ఆగాడు.

''అదిరింది కదూ హరీ?'' అన్నాడు నబిన్.

శిశిర్ భుజాలెగరేసి, ''అమృత బజార్ పత్రికను నేనెందుకు ప్రారంభించానో నీకు తెలుసు నబీన్, నా వ్యాఖ్యలలో నేను అన్న ప్రతిదానికీ నేను కట్టుబడతాను,'' అన్నాడు.

''ఇలాంటి రాతలను బ్రిటిష్ ప్రభుత్వం సహించదని నీకు తెలుసుగా'' అన్నాడు హరి.

''దానికి మనం ఆశ్చర్యపడనవసరం లేదు,'' అని అందుకున్నాడు శిశిర్.

''అప్పటి నుంచి మనం ఇంకా దూకుడు సంపాదకీయాలు అచ్చేస్తూ వచ్చాం. మన ప్రింటింగ్ ప్రెస్ ఏ క్షణంలో అయినా మూసి వేత ప్రమాదంలో పడవచ్చు,'' అన్నాడు బిజోయ్. నబిన్ తన స్నేహితుడి కేసి ప్రశ్నా ర్థకంగా చూసి, ''నీవేం చేయాలనుకుం టున్నావు శిశిర్? మనందరమూ జైలుకెళ తామా?'' అంటూ గాబరాపడ్డాడు.

శిశిర్ నిశితంగా చూస్తూ, ''అలాగే జర గాలని ఉంటే జరిగి తీరుతుంది మరి.''

***

మెజిస్ట్రేట్ కోర్ట్, జెస్సోర్ జిల్లా
క్రీ.శ 1870 మే 22. బెంగాల్ ప్రావిన్స్

''.... ప్రభుత్వానికి వ్యతిరేకంగా సంపాద కీయాలను రాయడం సంపాదకుడు శిశిర్



కుమార్ ఘోష్‌కు ఇది తొలి సారి కాదు.'' వాదించాడు ప్రాసిక్యూటర్. ''ఈ సంవత్సరం ప్రచురించిన మూడు వ్యాసాల్లో పాలకులకు, పాలితులకు మధ్య శాశ్వత సంఘర్షణ ఉన్నట్లుగా అమృతబజార్ పత్రిక నొక్కి చెప్పింది. పైగా, గ్రామీణ ప్రాంతాలో కూడా రాజకీయ సంస్థలను తప్పక నెలకొల్ప వలసి ఉంటుందని శిశిర్ ప్రకటించారు. పైగా వాటి సమన్వయానికి కలకత్తాలో కేంద్ర సంస్థను కూడా స్థాపించాలని చెప్పారు. ఇది తాజా ఉల్లంఘన మాత్రమే'' అంటూ ఊపిరి పీల్చుకుంటూ ముగించాడు ప్రాసిక్యూటర్.

''తాజా ఉల్లంఘన ఏమిటి?'' అంటూ జీరగొంతుతో నిందితుడికేసి చూస్తూ అడిగాడు జడ్జి. ''తనను తాను కవిగా చెప్పకుంటూ, పత్రికపనిలో చురుగ్గా సాయపడే సుజోయ్ గంగూలీ గత రెండు సంవత్సరాలుగా పన్ను ఎగ్గొడుతున్నాడు. గంగూలీ రాజద్రోహపూరితమైన పాఠాలను, కవితలను పంపిణీ చేశారు. ఏరియా పన్ను వసూళ్ల అధికారి మిస్టర్ గిల్మోర్‌పై నిరాధార ఆరోపణలను ప్రచురించడంలో శిశిర్ తన మిత్రుడు గంగూలీకి సహకరించాడు.'' అని ఆరోపించాడు ప్రాసిక్యూటర్.

''మిస్టర్ శిశిర్, ఇవి చాలా తీవ్రమైన ఆరోపణలు?'' అని జడ్జి ప్రశ్నించాడు.

శిశిర్ మందహాసం చేస్తూ, ''కానీ వీటిలో స్పష్టత లేదు మిలార్డ్'' అంటూ కొనసాగించాడు. 'నేను సుజోయ్‌కి సహకరించడం, ప్రోత్సహించడం వంటివి చేయలేదు. రెట్టింపు పన్ను వసూలు చేయాలని మిస్టర్ గిల్మోర్ ప్రయత్నించాడు. స్థానిక అధికారులు మాకు సహకరించ కపోవడంతో నేను అతడి గుట్టు బయటపెట్టాను. దీంట్లో నేరమేముంది?''

''చట్టాన్ని మీ చేతుల్లోకి తీసుకోవడంలోనే నేరం ఉంది మిస్టర్ శిశిర్.'' అన్నాడు జడ్జి.

''మీరు పన్నుల రికార్డులకేసి చూస్తే, నా వాదనే సరైందని మీరు తెలుసుకుంటారు మిలార్డ్'' చెప్పాడు శిశిర్.

మూడు గంటల తర్వాత ఊపిరి పీల్చుకుంటున్నట్లు కనిపించిన సుజోయ్ గంగూలీ, శిశిర్‌కు కృతజ్ఞతలు తెలిపాడు. ''మీకు ఎలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో తెలియడం లేదు శిశిర్, ముఖ్యమైన విషయం ఏమంటే గిల్మోర్‌పై తీవ్రస్థాయిలో విచారణ జరుగనుంది కదూ.''

శిశిర్ నవ్వుతూ ''అంతకంటే మిన్నగా రహస్య కవితా రచన విషయంలో నన్ను ఇరి

కించాలని వారు చూశారు. కానీ అది జరగ లేదు.'' అంటూ ఊపిరి పీల్చుకుని, ''నీ రచన లను ప్రచురించడానికి నీకు పత్రిక అవసరం లేదని భావిస్తున్నావా?'' అని అడిగాడు.

దానికి సుజోయ్ తలూపుతూ. ''పత్రిక మీద ఇప్పుడు ఉన్న దానికంటే మించిన భారాన్ని మోపదల్చుకోలేదు.'' అన్నాడు.

''మన స్వాతంత్ర్యం కోసం పోరాడటం ఏమంత భారం కాదు సుజోయ్, రాయడం కొనసాగించు. నీవు ఎంతమందికి చేరువయితే ఫలితాలు అంత ఎక్కువగా ఉంటాయి.''

✻ ✻ ✻

కలకత్తా, క్రీ.శ. 1878 మార్చి 13

''ఇతర వార్తాపత్రికలు, మేగజైన్లు కూడా కూడా మూతపడ్డాయి. భావ వ్యక్తీకరణా స్వేచ్ఛకు ఇది ముగింపు.''

''ఇప్పుడేనా?'' అంటూ శిశిర్ నవ్వాడు.

''ఈ పరిస్థితుల్లో నవ్వొస్తోందా నీకు? మనం నాశనమయ్యాం, శిశిర్!''

''చీకటి తర్వాత వెలుగు తప్పకుండా వస్తుంది''

✻ ✻ ✻

కలకత్తా, క్రీ.శ. 1878 మార్చి 14

సూర్యకిరణాలు గులాబి రంగులోకి మారుతున్నాయి. అనేక ఇళ్లల్లో ఆశ్చర్యం, ఆనందం ఒకేసారి పెల్లుబికాయి. కొత్త రోజుకు సంకేతంగా అమృత బజార్ పత్రిక వచ్చింది.

''పత్రిక పూర్తిగా ఇంగ్లీష్‌లో ఉందే!'' అంటూ నబీన్ ఆనందంతో గంతులే శాడు. తన స్నేహితులను ఆహ్వానిస్తూ శిశిర్ చెప్పాడు. ''బెంగాలీలో భావస్వేచ్ఛ ఉండకూడదని లార్డ్ లిట్టన్ నిశ్చయించు కుంటే అడ్డుకోవడానికి నేనెవరిని? ప్రాంతీయ భాషా ప్రెస్ యాక్ట్ ప్రాంతీయ భాషలకు మాత్రమే వర్తిస్తుంది నబీన్. అదే విషయాన్ని నేను ఇంగ్లీషులో అచ్చేస్తే వారేం చేయలేరు. అలా మన పత్రిక విముక్తి పొందింది.''

''శ్రీ గంగూలీని కలుసుకోండి.'' శిశిర్ ఓ ప్రశాంత మనస్కుడిని పరిచయం చేశాడు. ''ఇతడు కవి, ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేట్. గత నాలుగేళ్లుగా ప్రింటింగ్ ప్రెస్‌ను నడుపుతు న్నారు.'' నబీన్ మధ్యలో అడ్డుకున్నాడు. ''గంగూలీ.. సుజోయ్?''

శిశిర్ మందహాసం చేశాడు. ''సూర్యో దయం అయింది.'' – పవిత్రా శ్రీనివాసన్



# శిథిలాలయం - 2



*(శిఖిముఖి అనే శబరయువకు డొకడు అరణ్యానికి వేటకు వెళ్లి, అక్కడ కవచం ధరించి ఉన్న అశ్వికయోధు డొకడి మీద దొంగలు దాడి చేయడం చూసి, అతడికి సహాయం చేశాడు. ఆ యోధుడు తన పేరు విక్రమకేసరి అని చెప్పాడు. ఇద్దరూ కలిసి చీకటి వేళ పల్లెను సమీపించేటంతలో, పల్లెవాసులు వాళ్లకేసి పరుగెత్తుకు రాసాగారు. తరవాత...)*

శిఖిముఖి తనకేసి వచ్చే పల్లెవాసుల్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. అర్ధనగ్నంగా ఉన్న వాళ్లందరూ కూడా రకరకాల ఆయుధాలు ధరించి ఉన్నారు. ముందుగా శిఖిముఖిని సమీపించిన శబరులు అతడి చుట్టూ చేరి కేకలు వేస్తూ, పాటలు పాడసాగారు.

''ఈ గొడవంతా ఏమిటి? పల్లెపల్లెంతా కదిలినట్లుందే, ఇంతకూ ఏం జరిగింది?'' అని అడిగాడు శిఖిముఖి, తన చుట్టూ చేరి గంతులు వేస్తున్నవాళ్లను.

''అరణ్యంలో నిన్నూ, మరొక వింతమనిషినీ కొండ దొంగలు చంపేశారని విని, పల్లె పెద్దతో పాటు అందరం బయలుదేరాం. అడవిలో గొడ్లను మేపే పల్లెపిల్లలు చెప్పింది అబద్ధం అయినా కావాలి. లేదా నువ్వూ, ఆ ఇనపమనిషీ కలిసి కొండ దొంగలను చంపయినా ఉండాలి, కానీ వీటిలో ఏది నిజమో మిమ్మల్ని చూశాకే తెలిసింది.'' అన్నారు వాళ్లు సంతోషంగా.

అలా అంటూనే వాళ్ళు కొత్త మనిషిని పట్టి పట్టి చూడసాగారు.

శిఖిముఖి పెద్దగా నవ్వుతూ విక్రమకేసరి దగ్గరికి పోయి, ''చూశావా! మా పిల్లకారు వెధవలు గోరంతదాన్ని కొండంత ఎలా చేస్తారో, మనం దొంగల చేతిలో చచ్చిపోయామనే, వాళ్లు పల్లెకు పోయి చెప్పారట. దాంతో

ఊరుఊరే కదిలి వచ్చింది చూడు. నీకు వాళ్లు పెట్టిన పేరు ఇనపమనిషి,'' అన్నాడు.

విక్రమకేసరికి ఇదంతా మంచి వినోదంగా ఉన్నది. పల్లెవాసుల ఐకమత్యానికీ, తన నాయకుడి కుమారుడంటే వాళ్లకున్న వాత్స ల్యాభిమానులకూ అతడు చాలా సంతోష పడ్డాడు. శిఖిముఖికి హాని జరిగి ఉంటుం దేమో అని వారంతా పడుతున్న తపనను ప్రత్యక్షంగా చూస్తున్నాడు కాబట్టి తన తండ్రి తలపెట్టిన సాహసకార్యానికి నిజంగా తోడ్ప డగలవాళ్లు ఈ శబరులన్న నమ్మకం అతడి కాక్షణంలో కలిగింది.

శివాలుడు మరి కొందరితో కలిసి, తన కొడుకున్న చోటుకు రాగానే, అప్పటివరకూ శిఖిముఖి చుట్టూ చేరి గడబిడ చేస్తున్న వాళ్లందరూ పక్కకు తప్పుకున్నారు. శివాలుడు తన కొడుకును సమీపించి కౌగలించుకు న్నాడు. అంతలో కాగడా వెలుగుపైన పడ టంతో సైనిక దుస్తులతో దృఢంగా ఉన్న విక్రమకేసరి అతడి కంట బడ్డాడు.

అతడిని చూడగానే శివాలుడు ఒక్క క్షణ కాలం నిశ్చేష్టుడై పోయి, విక్రమకేసరిని కన్నార్పకుండా చూశాడు. తర్వాత పాత జ్ఞాపకం తట్టినట్లై అతడి కేసి రెండడుగులు వేసి, ''ఎవరూ, విక్రమకేసరి దొరా!'' అన్నాడు ఆనందం ఆశ్చర్యం వ్యక్తపరుస్తూ.

విక్రమకేసరి అతడిని సమీపించి నమ స్కరిస్తూ, 'నేను విక్రమకేసరినే, కానీ మీరు నన్నెరగరు,'' అన్నాడు.

శివాలుడు, విక్రమకేసరిని వింతగా చూస్తూ, ''అవును, నలభైఏళ్లనాటి మాట!



ఆ దొరా నా వయసువాడే, ఇప్పటికి ముసలి వాడు కాకుండా ఎలా ఉంటాడు? మేం ఇద్ద రమూ నీ వయసువాళ్లమై ఉండగా చక్రవర్తి సేనలో చేరి ఉత్తరాన బ్రహ్మపుత్రానది లోయల వరకూ జైత్రయాత్ర చేసి, చక్రవర్తికి అంతులేని ధనం, కీర్తి సంపాదించి పెట్టాం. చక్రవర్తి ఆస్థానంలో మాకు తిరుగు ఉండేది కాదు. ఇంతకూ నీవెవరు? మళ్లీ ఆనాటి దొర విక్రమ కేసరినే చూశానని భ్రమప డ్డాను,'' అన్నాడు ఆనందంతో.

''నేనా విక్రమకేసరి మనవడినే. నా పేరు కూడా విక్రమకేసరే. నా తండ్రిగారు మీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలని నన్ను మీ వద్దకు పంపారు'' అన్నాడు విక్రమకేసరి.

''ఆశ్చర్యంగా వుంది. మీ తాతగారు చని పోయారని కూడా విన్నాను. అయినా నీ రూపం నన్ను భ్రమింపజేసింది. మీనాన్న గారు జయపాలుడు క్షేమమా? ఈ శబరు




డిని ఆయన గుర్తుపెట్టుకోవడమే గాక, తన కుమారుడిని ఒక ముఖ్య విషయం మాట్లాడేందుకు పంపడం, నాకు అబ్బురం కలిగిస్తున్నది. సంస్థానాధీశులైన మీ తండ్రిగారు ఈ శబర పల్లె పెద్దతో సంప్రతించవలసిన అంత గొప్ప విషయం ఏమిటి?'' అని అడిగాడు శివాలుడు. అతడి ముఖంలో సంతోషం తాండవిస్తోంది.

''అదంతా మీ పల్లె చేరింతర్వాత చెబుతాను. నన్ను మీ పల్లె చేరకుండా అటకాయించేందుకు కొందరు దుర్మార్గులు అరణ్యంలో చాలా పెద్ద ప్రయత్నం చేశారు'' అన్నాడు విక్రమకేసరి.

''ఆ సంగతి తెలిసే మేమంతా అరణ్యానికి బయలుదేరాం. శిఖిముఖి వెంట ఉన్నది నా పూర్వ యజమాని మనవడని మాత్రం నాకు తెలియదు. ఎవరో ఇనుమనిషి అంటూ పసులుగాసే పిల్లలు చెప్పారు. ఎలాగైతేనేమి, ఇద్దరూ క్షేమంగా బయటపడ్డారు. ఇక పల్లెకు పోదాం పదండి,'' అన్నాడు శివాలుడు.

అరగంట తర్వాత అందరూ పల్లె చేరే సరికి, శివాలుడి ఇంటిదాపున చాలామంది ఆడవాళ్ళు గుంపుగా చేరి గొడవగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళందరి చేతుల్లోనూ నీళ్ళ కడవలున్నాయి.

శివాలుడూ, అతడి వెంట ఉన్న పల్లెవాసులూ అడిగిన మీదట, తాము నీరు తెచ్చుకునేందుకు కొలను వెళ్ళామనీ, అక్కడ కొందరు కొత్తవాళ్ళు కనిపించి, శివాలుడి ఇల్లెక్కడ అని అడిగారనీ చెప్పారు. వాళ్ళు చూడడానికి దారి దోపిడీగాళ్ళలా ఉన్నారనీ, అందరి చేతుల్లోనూ ఆయుధాలున్నవనీ కూడా చెప్పారు.

ఒకటికి రెండు సార్లు ప్రశ్నించిన మీదట ఆడవాళ్ళు ఆ కొత్తవాళ్ళు ధరించిన దుస్తుల తీరూ అదీ వర్ణించారు. వాళ్ళు చెప్పిందానికి, అరణ్యంలో గొడ్లకాచే పల్లెపిల్లలు దొంగలను గురించి చెప్పిందానికీ అతికినట్టుగా సరిపోయింది.

శివాలుడు అక్కడ ఎవరితోనూ, ఏమీ అనక, తన ఇల్లు చేరగానే, విక్రమకేసరితో, ''ఆ దొంగలెవరో కాని గొప్ప సాహసికులుగా ఉన్నారు. తామెరుగని ప్రాంతాలకు వచ్చి, శబరపల్లె పెద్ద ఇంటిమీదే దాడి చేయాలని చూస్తున్నట్లు కనబడుతున్నది. ఎంత ధైర్యం వాళ్ళకు?!'' అన్నాడు.

''వాళ్ళు ఒక వేళ మీ ఇంటిమీద దాడికి వస్తే, మీ కోసం కాదు. నాకోసం. నేనూ, శిఖి




ముఖి కలిసి పల్లెకేసి బయలు దేరడం వాళ్ళు చూసి ఉంటారు. వాళ్ళక్కావలిసింది నా ప్రాణం కన్న ముఖ్యంగా ఈ సంచీలో ఉన్న వస్తువులు.'' అంటూ విక్రమకేసరి గుర్రం జీను నుంచి వేలాడుతున్న సంచీ విప్పి, శివాలుడికి అందించాడు.

శివాలుడు ఆ సంచీని భద్రంగా గదికి ఒక మూల ఉన్న కులదేవతల విగ్రహాల ముందు పెట్టి, ''రాత్రి చాలా ఉంది. ఇంకా తీరిగ్గా మాట్లాడుకోవచ్చు. ముందు తిండీ తిప్పల సంగతి చూద్దాం.'' అన్నాడు.

తర్వాత, అనుకోని అతిథికి తిండి తిప్పలు ఏర్పాటు చేయాలని అతడు గూడెంవారికి పురమాయించాడు.

కాస్సేపటి తరువాత అందరూ రకరకాల అడవి మాంసాలతో, పానీయాలతో తృప్తిగా భోజనం చేశారు. శివాలుడు గోడకానుకుని కూర్చుని గుడుగుడులో పొగాకు తుంపి వేసి, నిప్పంటించి, పొగపీలుస్తూ, ఎదురుగా గొంగళ్ళు పరిచిన చాపమీద కూర్చుని ఉన్న విక్రమకేసరి, శిఖిముఖుల కేసి చిరునవ్వు నవ్వుతూ చూసి, ఇలా అన్నాడు.

''మీ ఇద్దర్నీ పక్కపక్కల చూస్తుంటే, నాకు విక్రమ కేసరి దొర గుర్తుకొస్తున్నాడు. ఆయన మనవడు ఒకానొక రోజు నా ఇంటికొచ్చి అతిథిగా ఉండబోతాడని నేనేనాడూ ఊహించలేదు.'' అన్నాడు.

''నా తండ్రి కూడా నేను శూరదేశం నుంచి ఇంత దూరం ప్రయాణం చేయవలసొస్తుందని కలలో కూడా అనుకుని ఉండడు.

ఆయన మా తాతగారి గురించి, మిమ్మలను గురించీ చాలా అద్భుత విషయాలు చెబుతుండేవాడు. కాని... మీకు ఇప్పటి వరకూ తెలియని సంగతొకటి చెబుతాను.

మా తాతగారు విక్రమకేసరి ఇప్పటికి ఇరవై సంవత్సరాల క్రితం మరొకసారి బ్రహ్మపుత్రానదీ ప్రాంతాల ఉన్న కామాఖ్య నగరం కేసి వెళ్ళాడు. పోయి ఇంతకాలమైనా తిరిగి రాలేదు. అక్కడే చనిపోయి ఉంటాడనుకున్నాం. కాని ఇప్పటికి రెండు నెలలక్రితం మాకు అందిన వర్తమానాన్ని బట్టి ఆయన ఇంకా సజీవుడేమో అన్న అనుమానం కలుగుతున్నది.'' అన్నాడు విక్రమ కేసరి.

ఆ మాటలు వింటూనే శివాలుడు ఆశ్చర్యపడుతూ, విక్రమకేసరి కేసి తేరిపార చూసి, 'కేసరి దొర మరొకసారి ఆ బ్రహ్మపుత్రానదీ ప్రాంతాల్లోని అరణ్యాల కేసి వెళ్ళారా? ఇది జరిగి ఇరవై ఏళ్ళయిందా? ఈ విషయం మాట మాత్రంగా మనిషితో కబురు పెట్టి

ఉంటే, నేనూ ఆయన వెంట బయలుదేరే వాడినే, ఇంతకూ ఆ దొర మళ్లీ అంతదూరం ఎందుకెళ్లినట్టు?'' అని ప్రశ్నించాడు.

''అదేదో చాలా నిగూఢ రహస్యం అనీ, తాను చచ్చేలోపల సాధించి తీరవలసిన కార్యమని, ఆయన మా తండ్రిగారితో చెప్పారట. అంతకన్న వివరాలేమీ చెప్పలేదు. కాని, రెండు నెలల క్రితం మా సంస్థానం వారే అయిన ఒక పండితుడు ఆ ఉత్తర దేశం నుంచి తిరిగి వచ్చి, మాతాతగారి వస్తువులంటూ కొన్ని మా నాయన గారికి ఒప్పచెప్పాడు.

వాటిలో అధిక భాగం తాళపత్ర గ్రంథాలు. అతడు చెప్పేదాన్ని బట్టి మా తాతగారు అక్కడి కొండల్లో ఎక్కడో సన్యాసిగా జీవిస్తున్నాడని తెలుస్తున్నది. అయినా అందుకు గట్టి రుజువేమీ లేదు.'' అన్నాడు విక్రమకేసరి.

శివాలుడు కొంచెం సేపు తల వంచుకు ఆలోచిస్తూ వూరుకుని, అవును ''నువ్వు చెప్పేది వింటూంటే నాకు మతిపోతున్నట్లుగా ఉన్నది. ఆ దొర మళ్లీ ఆ ఘోరారణ్య ప్రాంతాలకు ఎందుకెళ్లాడు? ఆ నిగూఢ రహస్యం ఏమిటి? ఆయన వస్తువులు మీ సంస్థాన పండితుడి కెలా దొరికినై?'' అని అడిగాడు.

విక్రమకేసరి, పండితుడు చెప్పినదంతా శివాలుడికి కొద్ది మాటల్లో చెప్పేశాడు. ఆ పండితుడు బాల్యంలోనే ఇల్లు విడిచి నానా దేశాలూ తిరిగి, శాస్త్రవిద్యలన్నీ నేర్చుకుని వద్ధాప్యంలో తిరిగి ఇంటికి చేరాడు.



ఆయన బ్రహ్మపుత్రానదీ ప్రాంతాల్లోని అరణ్య ప్రదేశాల్లో చాలాకాలం నివశించాడు. అక్కడ ఉండే ఆటవికులకు రోగాలూ రొప్పులూ వస్తే మందుమాకులిచ్చి వారికి సహాయపడ్డాడు.

ఆ ఆటవికుల్లో అనేక జాతులవాళ్లూ, భాషల వాళ్ళూ ఉన్నారట. వాళ్ళలో ఇభ్యులనే ఏనుగులను మచ్చిక చేసే జాతివాళ్లు, ఆ పండితుడి జన్మదేశం అవీ తెలుసుకుని, తమ పల్లెల్లో విక్రమ కేసరి అనే క్షత్రియుడు కొంత కాలం తన నౌకరుతో నివశించాడనీ, అతడికి మన్నె జ్వరం రాగా అడవికి మూలికల కోసం పోయినప్పుడు పులి ఎత్తుకు పోయిందనీ చెప్పారట.

ఆయనకు సంబంధించినవే అంటూ కొన్ని తాళపత్రగ్రంథాలూ, చిన్న కత్తి వగైరా ఆ పండితుడికి ఒప్పచెప్పారు. కాని, ఆయన ఆ అరణ్యంలో మరొక ప్రాంతానికి వెళ్లి

నప్పుడు, విక్రమ కేసరి అన్న పేరుగల సుక్షత్రియుడొకడు అఘోరీలనే సన్యాసులతో కలిసి కొండల్లో నివశిస్తున్నట్లు మరికొందరు చెప్పారట.

ఆ పండితుడు ఆ సన్యాసుల్లో చాలా మందితో మాట్లాడి చూశాడు. కాని, ఉన్నాడనటమే తప్ప మా తాతగారు ఎక్కడ ఉన్నదీ వాళ్లల్లో ఏ ఒక్కడూ చెప్పలేకపోయాడు.

ఇదంతా విన్న మీదట మా నాయన, మా తాతగారి వస్తువులనబడే వాటన్నిటినీ ఈ సంచిలో పెట్టి మిమ్మల్ని కలుసుకుని మాట్లాడితే ప్రయోజనం ఉంటుందేమో అని నన్నిక్కడికి పంపారు.

సంచీలో ఉన్న తాళపత్ర గ్రంథాల్లో కొన్ని మా తాతగారు స్వహస్తంతో రాసినవి. అవి చదివితే మీకు ఆయన ఏ నిగూఢ రహస్యాన్ని ఛేదించేందుకు ఆ ప్రాంతాలకు వెళ్లాడో తెలియవచ్చు. అంతేకాక వాటి ద్వారా మీరు ఆయన సజీవుడో కాదో కూడా గ్రహించగలరని మా తండ్రిగారు ఆశపడుతున్నారు.

ఇలా, విక్రమకేసరి చెప్పినదంతా శ్రద్ధగా విన్న శివాలుడు కొద్దిసేపు మౌనంగా పూరుకుని హఠాత్తుగా ఏదో జ్ఞప్తికి వచ్చినవాడిలా తుళ్లిపడి, ఇలా అన్నాడు. ''బహుశా, కేసరి దొర ఛేదించదలచిన నిగూఢ రహస్యం శిథిలాలయానికి సంబంధించినది కాదు గదా? ఒక వేళ అదే నిజమయినట్లయితే ఆ ఆలయాన్ని చేరటం కన్న హిమాలయాల్లోని కైలాసగిరి శిఖరం ఎక్కటం తేలిక. శిఖీ, ఆ సంచీ ఇటు తీసుకురా,'' అని దాపులనున్న తన కొడుకును హెచ్చరించాడు.

శిఖిముఖి లేచి కులదేవతల విగ్రహాల ముందున్న సంచీ తీసుకుని తండ్రి దగ్గిరకు వచ్చి, దాన్ని అతడి చేతికి అందించబోయాడు.

అంతలో వీధి వైపుకు ఉన్న తలుపును చీకటి కమ్మినట్లయింది. నల్లని దుస్తులు ధరించిన ఒక వ్యక్తి – ఆరున్నరా ఏడడుగుల పొడవుగల మరీ బక్కపలచని వాడు, తల మీద గుడ్లగూబ ఆకారంలో ఉన్న శిరస్త్రాణం ధరించి – వాళ్ల ముందు ప్రత్యక్షమయ్యాడు.

శివాలుడూ, శిఖిముఖి, విక్రమకేసరీ బీతిగొలుపుతున్న ఆ భారీ వికృతాకారాన్ని చూస్తూనే ఒక్కసారిగా నిర్విణ్ణులయారు.

– ఇంకా ఉంది







## నీటి అడుగున నివాసం

(వాహనంలో ఉన్న వారు మెల్లగా వరుస కట్టారు. ఒకరి వెనుకగా ఒకరు. చిన్నవారు, భయపడుతున్నారు. ఆందోళనగా ఉన్నారు. వాళ్ల ముఖాలు కిందికి వాలిపోయాయి. వీపులు వంగిపోయి ఉన్నాయి. మానవులు అధినాధులు కాని గడ్డమీదికి వాళ్లు వచ్చారు.)

ఒకరి వెనుక ఒకరి ముఖాలను నేను పరీక్షగా చూశాను. వారిలో మా అమ్మానాన్నా లేరు. కొంచెం అసంతృప్తిగా ఉన్నప్పటికీ ఏమూలో కాసింత ఉపశమనం. బహుశా వాళ్లు ఎక్కడో ఓ చోట సురక్షితంగా ఉన్నారని అర్థం. నేను



పరిశీలనగా చూస్తుండగా, సైబీరియా పులి బాధ్యత తీసుకుని మానవులందరినీ ఒక చోటికి చేర్చింది. అది పెద్దగా అదిలించిందేమీ లేదు. వారికి సమీపంగా వెళ్ళి గురగురలాడింది.

వాళ్లు అందరూ గుంపుగా ఒక చోట చేరిన తర్వాత, మయూరి అన్నది, ''నా వెంట రండి, మిమ్మల్ని నేనే గుహల్లోకి తీసుకువెళతాను'' శంతను ఒకింత ఆందోళనతో చూశాడు. అయితే ఇతరుల ముఖాలు బావరహితంగా ఉన్నాయి: అక్కడ 70 మంది పురుషులు, 30 మంది మహిళలు ఉన్నట్లు గమనించాను. వారిలో చాలామంది భారతీయులే. జాతుల వారీగా రోదసీ వాహనాలు వర్గీకరించబడ్డాయి. అడవిదున్న దీర్ఘ శ్వాస నా చెవులకు తగులుతోంది. మెల్లగా కదిలే దాని కళ్లను చూసేందుకు నేను వెనక్కు తిరిగాను. ''హేయ్,'' అని పలకరించాను. ''హల్లో'' అంటూ ఆశ్చర్యకరంగా మృదుస్వరంతో అది మాట్లాడింది.

నేను శంతను వద్దకు మాట్లాడేందుకు వెళ్లాను. అతడు నిమ్మి చేతిని గట్టిగా పట్టుకుని ఉన్నాడు. ఆమె నిశ్చయంగా అతడి కూతురే కావచ్చునని తలిచాను. ''శివా,''



అంటూ నన్ను పిలిచి, ''ఈ ప్రాణులు చెబుతున్నది నిజమే అయితే మనం అంతరించిపోతామా? అని ప్రశ్నించాడు శంతను''

''నేను ఏమీ చెప్పలేను, ఈ ప్రాణులలో ప్రతి ఒక్కటీ మానవులను ద్వేషించడం లేదు. మనం ఒకటిగా ఉండి మేం హాని కలిగించే వారం కామని వారికి నచ్చచెప్పినట్లయితే మనం మనగలిగే అవకాశాలు ఉంటాయి.'' అని అన్నాను.

''ఈ స్థలం బంగారు గనిలా ఉందే!'' మెల్లగా అన్నాడు శంతను.

''ఏమిటీ?'' ఆశ్చర్యంతో అడిగాను.

''నువ్వు చూడలేదా? మనం పూర్తిగా కోల్పోయామని భావిస్తున్న అనేక ప్రాణులు ఇక్కడ ఉన్నాయి... వారి జన్యువులను నేను సేకరించి వాటిని భూమ్మీదికి తీసుకుపోగలిగానంటే మనం భూమ్మీద వాటిని తిరిగి బతికేలా చేయవచ్చు.'' చెప్పాడు శంతను.

అతడి కళ్లలో కనిపిస్తున్న ఉన్మాదానందం ఉన్నట్లుండి నాలో కంపరం కలిగించింది.

''కాని, అదెలా సాధ్యం? అనునిర్వలో అంతా తేడాగా ఉంటుంది, ఈ గడ్డ మహత్యం ఏమిటంటే ఒకే వాతావరణం, ఉష్ణోగ్రత, నివాసప్రాంతంలో ఇక్కడ ప్రతి ఒక్కరూ కలిసి జీవించవచ్చు. భూమి ప్రస్తుతమున్న స్థితిలో ఈ జీవులు తిరిగి అక్కడికి వెళితే వాటికి ఏం జరుగుతుందో ఎవరూ చెప్పలేరు మరి!'' అన్నాను.

''అవి కేవలం అవాంతరాలు మాత్రమే! ఇలాంటివాటిని సులభంగా అధిగమించవచ్చు!'' చెప్పాడు శంతను.

నేను అతడి మాటలను పెద్దగా పట్టించుకోలేదు. నాకు ఉమశమనం కలిగిస్తూ, సైబీరియా పులి శంతను వైపుకు వచ్చి ''మనం వెళ్లవలసిన సమయం ఆసన్నమైందనుకుంటాను,'' అన్నది.

మయూరి సుతారంగా అనునిర్వలో దారితీస్తూ వెళుతుంటే మానవులు ఆమెను అనుసరించసాగారు. వారిలో చాలామంది మౌనంగా ఉన్నారు. నిమ్మి, హర్షా మాత్రమే మా బృందంలో చిన్నపిల్లలు. అనునిర్వకు నేను వచ్చి ఎక్కువ రోజులు కాలేదు కానీ, వీళ్లతో పోలిస్తే నేను పెద్దవాడినే మరి! వాళ్లు దారిపొడవునా ప్రశ్నలు సంధిస్తూ వచ్చారు. నా శక్తిమేరకు సమాధానాలు ఇస్తూ వచ్చాను. చివరకు మేము భీకర సముద్రాన్ని చేరుకున్నాము. మయూరి కనులు మూసుకుని

చిన్న స్వరంతో జపించడం మొదలుపెట్టింది. నీళ్లలోంచి జలభూతం లాగా ఒక ఓడ పైకి లేచింది. అది ఆమెవైపు హంసలాగా తేలుతూ వచ్చింది. నిమ్మీ, హర్షా తమ ఆశ్చర్యాన్ని అణ చుకోలేకపోయారు.

''వావ్, వారెవ్వా!'' అంటూ హర్షా ఎగ శ్వాస పీల్చాడు. ఓడ తీరం వద్దకు వస్తుంటే నిమ్మీ అసహనంగా చూసింది.

''దాంట్లో ఎవరూ లేరు!'' అని ఆశ్చర్య పడుతూ చెప్పింది నిమ్మీ.

నేను నవ్వాను. వాళ్లు ఈ లెక్కన చాలాసార్లే ఆశ్చర్యపోవలసి ఉంటుంది!

మయూరి శంతనుడితో ''దిగు'' అని చెప్పింది. ఆశ్చర్యంతో ఆమెకేసి చూశాన్నేను. నేనూ మిగతా బృందంతో కలిసి వెళ్లవలసి ఉంటుందేమో! ఒక మాట కూడా నేను చెప్పకుండానేఆమె అర్థం చేసుకున్నట్లుంది.

''సరే'' అంటూ ఓమెన్‌బాధ్యత తీసుకుని, ''ఇప్పుడు మనం సముద్రజలాల్లోకి వెళు తున్నాం. ప్రతి ఒక్కరూ సహకరించండి. కంచెరగాడిద ఇచ్చే తొడుగులు ధరించండి. మీరు ఉన్నచోటునే నిలబడండి,'' అన్నాడు.

చివరి మాటలను అతడెంత నొక్కి చెప్పా డంటే ఆ వేగానికి కూర్చున్న చోట నుంచి పడిపోయాడు. నేను నా చూపులను పక్కకు మరల్చుకుని ప్రతి ఒక్కరూ తొడుగులను ధరించడం చూశాను.

''నీటిలోపల మీరు శ్వాస పీల్చుకోవడా నికి, మాట్లాడేందుకు కూడా సహాయపడ తాయి.'' అన్నాడు ఓమెన్. హర్షా సమాధాన పడినట్లు కనిపించలేదు. అయితే, అతడు



తొడుగును ధరించి, కాస్త భీతిల్లుతున్నట్లు కనిపించాడు.

జనాన్ని చూస్తూ ''మంచిది, నేను లెక్క బెడతాను.. 1..., 2..., 3...!'' అంటూ లెక్కించాడు లెమెన్.

నిమ్మీ తన లెక్క అందుకుని ''నాలుగు'' అన్నది. దాంతో ఆమె వైపు తీవ్రంగా చూశాడు లెమెన్. కానీ నిమ్మీ లెక్కచేయలేదు.

ఇంతలో సుందరమైన, భీతావహమైన రజత వర్షం ప్రారంభమైంది. మేం ఓడలో నిలబడి ఉండగానే, వర్షపు చుక్కలు నేల మీద కురిశాయి. పడ్డచోటల్లా నీటి గుంతలు ఏర్పడ్డాయి. ఒమెన్ చక్రం పట్టుకుని తిప్పడం మొదలు పెట్టాడు. ప్రతి ఒక్కరూ కట్టుకద

లకుండా ఉన్నారు. ఓడ పట్టులాగా మెత్తగా నీటిలో మునగడం మొదలుపెట్టింది.

త్వరలో, మేం నీటి అడుగుకు చేరాం. నా చుట్టూ ఉన్నవారు విస్ఫారిత నేత్రాలతో చూస్తుండటం గమనించాను. వారి కళ్లలోని ఆశ్చర్యాన్ని రబ్బరు తొడుగులు దాచి ఉంచలేకపోయాయి. మయూరి ప్రయత్నరహితంగా గుహలకేసి నడిచింది. నీటి లోపల పగడపు దిబ్బల నిర్మాణాన్ని నేను నిమ్మీ, హర్షాలకు చూపించాను. వాళ్లు ఆశ్చర్యపోయారు.

శంతను మా పక్కనే ఈదుతూ ఉన్నాడు. అతడి కళ్లకేసి చూస్తుండగా నాలో ఒకవిధమైన ఇబ్బంది కలిగింది. అతడి కళ్లు అటూ ఇటూ చూస్తూ దేనికోసమో వెతుకుతున్నాయి. అవి ప్రతి దృశ్యాన్నీ ఆబగా పట్టుకునేలా కనిపించాయి. అతడు నా కేసి చూశాడు. నేను వేగంగా చూపులు తిప్పుకున్నాను. మొత్తం మీద మేం గుహలను చేరుకున్నాం.

సముద్ర పుష్పాల పక్కన జలదేవతలు మౌనంగా నిలబడి ఉన్నారు.

''ఆగండి'' అంటూ గవ్వల హారాలు ధరించిన ఓ జలదేవుడు అడ్డుకున్నాడు. మయూరి అతడికేసి చూసింది. కానీ అతడు చలించలేదు. ''పథకంలో ఈ మార్పు ఎందుకు?'' అని ప్రశ్నించాడు. ''అనూహ్య పరిస్థితుల వల్ల మార్చాను. నా ఉద్దేశ్యాలను ప్రశ్నిస్తున్నావా?'' అని జవాబిచ్చింది మయూరి.

''మానవుల ఉద్దేశ్యాల గురించి మనం చింతించనవసరం లేదు'' జలదేవుడు చివరి పదాన్ని నొక్కి చెబుతూ అన్నాడు. మయూరి కళ్లు ఆగ్రహంతో మెరవడం గమనించాను. తనను మనిషి అని పిలవడాన్ని ఆమె ద్వేషిస్తుంది. జలదేవుడు కూడా ఆ విషయాన్ని స్పష్టంగా గ్రహించినట్లు కనబడుతోంది.

''మానవులను అంతరింపజేసే పథకం నేను ఊహించినంత సులభంగా రాలేదని నీకు బాగా తెలుసు'' మయూరి జలదేవుడితో చెబుతుండగా శంతను ఊపిరి బిగపట్టడం నేను పసిగట్టాను. ''దేవుడు సర్వజ్ఞుడు. కాకపోయినా ఆవిధంగా మనం నమ్ముతున్నాం,'' చెప్పాడు జలదేవుడు.

మయూరికి ఎదురు చెప్పిన అతడి సాహసానికి నేను ముగ్ధుడినయ్యాను. ''మానవులు ఇతరుల కంటే పురోగమించిన





జీవులు.'' దీంతో నైలు మొసలి ఆగ్రహించింది. అనునిర్వ వాసులకు ఏదో విషయాన్ని రహస్యంగా ఉంచినట్లు మయూరి అంగీరించిందా! బాగుబాగు... అంటూ ఆమె నైలు మొసలి వైపు తిరిగి, ''వాళ్లు కొన్నింటిలో అందరికంటే పురోగాములు. దీన్ని మనం అంగీకరిస్తాము కూడా అయితే వారు పూర్తిగా విఫలమయ్యే విభాగాలు చాలానే ఉన్నాయి. నేను, వాళ్లను గొప్ప చేసే ప్రశ్నే లేదు. వారు మన పథకాలను ఊహించి తమ విధి నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నించారు. వారు తమ ప్రయత్నాలలో విజయం సాధించారని ఇప్పటికిప్పుడు చెప్పలేను. అయితే వారు చేయగలరని మనం ఊహించిన విధంగా పరిణామాలు జరగలేదు,'' అని చెప్పింది మయూరి.

ఉన్నట్లుండి, నేను తాతయ్య, లాడ్డూను తల్చుకున్నాను. జలదేవతలు వారిని విడుదల చేస్తామని వాగ్దానం చేశారు... తప్పించుకోవడానికి నా స్వంత ప్రయత్నం చేయాలని నిర్ణయించుకున్నాను. అందరూ మయూరిని, జలదేవుడిని చూస్తున్నందువల్ల ఎవరూ నేను తప్పుకోవడం గమనించలేదు.

నీళ్లు బాగా చల్లగా ఉన్నాయి. తాతయ్య, లాడూ ఎక్కడ ఉంటారు? జలదేవతలు వారిని కూడా గుహల్లో ఉంచారా? వారు ఎక్కడైనా ఉండవచ్చు. నా దారి తప్పిపోకుండా వారిని కనుగొనడం కష్టమే. నేను ప్రవేశద్వారం వద్ద తచ్చాడుతుండగా గుహ గోడపై రాబిన్ ఉండటం చూశాను. అతడు తన రెక్కలను స్నేహపూర్వకంగా ఆడించాడు. గుహల లోని ప్రయాణీకుల విషయం రాబిన్‌కు బాగా తెలుసని నాకు గుర్తు.

''అక్కడకి వెళ్లడానికి నాకు సహాయపడగలవా?'' అని అడిగాను. దానికి అతడు తన రెక్కలను అటూ ఇటూ ఊపుతూ ''నీవు వెదకదలిచినదేమిటీ?'' అని ప్రశ్నించాడు.

దానికి జవాబుగా ''తాతయ్యను, అతడి కుక్కను నేను చూడాలనుకుంటున్నా. వాళ్లు ఎక్కడ ఉన్నారో నీకు తెలుసా?'' అన్నాను.

''నాకు తెలుసు'' అంటూ సంతోషంగా చెప్పాడు రాబిన్.

''నన్ను అక్కడకు తీసుకెళతావా?'' అని అడిగాను నేను.

''తీసుకెళ్లలేను'' చెప్పాడతడు.

అతడి బొద్దింక దేహం కేసి చూశాను. అతడిని ప్రలోభపెట్టడం ఎలా అని ఆలోచించాను.

‘‘నీవు నాకు లంచం ఇవ్వాలని అనుకుం టున్నావా?’’ అడిగాడు అతడు. నేను గాభరాగా లేదని తెలూపాను.

‘‘సరే. ఈ విషయం ముందే ఎందుకు చెప్పలేదు.’’ అని అతడు ప్రశ్నించాడు.

‘‘బొద్దింకలకు మెదడు ఉందా? వాళ్లెంత తెలివైన వారో నేను చెప్పలేను. సగం స్మృతిలో ఉన్న వారితో నేను మాట్లాడానని మాత్రమే నాకు తెలుసు,’’ అన్నాను. ‘‘వెళ్లి నాకు ఏదైనా తెచ్చివ్వు’’ అని వెంటనే నేను నా జేబులోకి చెయ్యి దోపాను. జేబులో తాళంచెవి, నా రైలు టికెట్ ఉన్నాయి. మా నాన్న దాన్ని ప్లాస్టిక్ కవర్‌లో పెట్టి ఇచ్చాడు. ‘‘వీటిలో నీకు ఏది కావాలి?’’ ఊరిస్తున్నట్లుగా అడిగాను.

‘‘ఏదీ వద్దు.’’

‘‘అయితే ఇవి తప్ప నావద్ద మరేమీ లేవు!’’

‘‘నేను నీకు సముద్రాన్ని ఇస్తాను’’ సిగ్గు పడుతూ చెప్పాను. ‘‘జలదేవతల కంటే అది ఎక్కువేనా?’’ అని అడిగాడతడు. ‘‘తక్కువే’’ అని చెప్పాను.

‘‘బాగుంది’’ అని నవ్వాడతడు. ‘‘రా మరి, మీ వాళ్లు ఓ దయ్యపు కప్పతో ఉన్నారు. అతడు వారికిప్పుడు ఆతిథ్యం ఇస్తూ ఉంటాడు!’’

నేను రాబిన్‌తో పాటు నిశ్శబ్దంగా నడుస్తున్నాను. నా హృదయం గట్టిగా కొట్టుకొంటోంది. చివరకు మేము ఓ చిన్న ద్వారం వద్దకు చేరుకున్నాం. ఓ చిన్న శబ్దం వినబడింది. ఉన్నట్లుండి మొరిగిన శబ్దం. లాడూ నన్ను వాసన చూసింది. అది గుహలోంచి బయటకు వచ్చి, దాని తోకను నా మోకాలికేసి కొడుతోంది. గుహలోకి అడుగు పెట్టాను. అక్కడ తాతయ్య. పొడవాటి రాయి మీద కూర్చుని ప్రశాంతంగా నవ్వుతున్నాడు.

‘‘నువ్వు ఎలాగోలా వచ్చావన్నమాట.’’ అన్నాడు. నేను తాతను కౌగలించుకుని జరిగినదంతా చెప్పాను. ‘‘శంతనుకు నీవు ఏమైనా చెప్పావా?’’ తాతయ్యను అడిగాను. మానవుల రాకను గురించి తాతకు చెప్పడం ప్రారంభించాను. ‘‘అవును ఎందుకూ?’’

‘‘అతడు పాత స్నేహితుడు’’ తాతయ్య చెప్పాడు. అయితే అతడు తన స్నేహితుడు అని చెబుతున్నప్పుడు సరైన అర్థంలోనే చెబుతున్నాడా అని సందేహపడ్డాను.

(ఇంకా ఉంది)

– సౌమ్యా రాజేంద్రన్



# చందమామ కబుర్లు

## అంగారక గ్రహంపైకి కొత్త కాంపాక్ట్ రోవర్



ఇల్లినాయిస్‌లోని డిజైన్ కన్సల్టింగ్ సంస్థ అంగారక గ్రహయాత్ర కోసం కొత్త స్పేస్ రోవర్‌ను రూపొందించింది. ఈ రోవర్‌లో రోదసీయాత్రికులు మూడు వారాలపాటు అంగారక గ్రహంపై ఉండగలగడమే కాకుండా పని, నిద్ర, వ్యాయామం వంటి పనులను సులువుగా చేసుకోగలరట.

మాంట్‌గోమెరీ డిజైన్ ఇంటర్నేషనల్ యజమాని గ్రెగ్ మాంట్‌గోమరీ ప్రకారం, ''ఈ రోవర్‌ని అంగారక గ్రహం మీదికి బలంగా విసిరికొట్టిన రీతిలో దింపాల్సి ఉంటుంది''

అంగారక యాత్ర అవసరాలకు తగిన విధంగా ఈ రోవర్‌ని రూపొందించారు. ఇతర రోవర్లలోనూ అమర్చగలిగే ప్రత్యేక బ్యాటరీలను, సామగ్రిని, తదితర వసతులను ఈ రోవర్‌లో పొందుపర్చారు. ఈ సందర్భంగా నాసా సంస్థ ఓ ప్రకటన వెలువరిస్తూ, 2037లో తాము అంగారక గ్రహం మీదికి మానవ సహిత వాహనాన్ని పంపనున్నట్లు తెలిపింది.

## ప్రపంచంలోనే అతి పొట్టివాడు

కాట్మండూలోని ఓ నేపాలీయుడి ఎత్తు కేవలం 56 సెంటీమీటర్ల మాత్రమే. ప్రపంచంలో జీవిస్తున్న వారిలో అతి పొట్టివాడుగా తన పేరు గిన్నెస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో నమోదు చేసుకోవడం కోసం ఇతడు యూరప్ యాత్రకు సిద్ధమవుతున్నాడు. ఖగేంద్ర థాపా మగర్, అతడి తండ్రి త్వరలో ఇటలీకి వెళ్లనున్నారు. లండన్‌కి చెందిన గిన్నెస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో మగర్ పేరు నమోదు చేయించడానికి వారు దరఖాస్తు చేయనున్నారు. దక్షిణాసియా నేపాల్‌లో బాగ్లుంగ్ జిల్లాలో మగర్ 1992లో పుట్టాడు. ఎనిమిదేళ్లప్పుడు అతడు నడవటం ప్రారంభించాడు. 11 ఏళ్ల ప్రాయంలో అతడిలో ఎదుగుదల ఆగిపోయింది.



ప్రపంచంలో అతి పొట్టివాడిగా ప్రస్తుతం చైనాకు చెందిన హెపింగ్ పింగ్ పేరిట ఉంది. ఇతడి ఎత్తు 73 సెంటీమీటర్లు.

# ఉదయ తారలు

## వి. టర్బు

కోచ్చికి చెందిన పదవ తరగతి విద్యార్థి టర్బు, నాన్న ప్రోత్సాహంతో ఈతను తన వృత్తిగా చేపట్టాలని నిర్ణయించుకున్నాడు. తన తండ్రికూడా జాతీయ స్థాయి ఈతగాడు కావడం విశేషం. ఐదేళ్ల వయసులోనే అతడు ఈత నేర్చుకోవడం ప్రారంభించాడు. కేరళలోని కాలమాస్సేరిలోని రాజగిరి స్విమ్మింగ్ ఎకాడమీ క్రీడా విభాగం ఇతడిని ఎంపిక చేసిన తర్వాత లాంఛనప్రాయంగా శిక్షణ మొదలయింది.

శ్రమించే తత్వం గల ఈ ఛాంపియన్ రోజుకు 6 గంటల పాటు క్రీడాభ్యాసం చేస్తాడు. శిక్షకుడు ఉన్ని క్రిష్ణన్ నాయర్‌తో కలిసి ఈత కొలనులో వైవిధ్యపూరితమైన విన్యాసాలు చేస్తాడు.

టర్బు అభిప్రాయం ప్రకారం, సౌకర్యాల లేమి, మౌలిక వసతులు కొరవడటమే క్రీడాకారుడికి నిజమైన సవాల్‌గా ఉంటోంది. అదృష్టవశాత్తూ, తనకు అద్భుతమైన ప్రాక్టీస్ సౌకర్యాలు, ఉత్తమ కోచింగ్ లభించాయని ఇతడు సంతోషం వ్యక్తం చేస్తున్నాడు.

బ్యాక్ స్ట్రోక్‌లో మాజీ జాతీయ ఛాంపియన్ టికె సెంథిల్ కుమార్ బాలటర్బుకు ఆదర్శమట. ఈతను వృత్తిగా చేపట్టాలని టర్బు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఆసియా క్రీడలలో పతకాలు గెలవడంపై కన్నేసిన టర్బు ఒలింపిక్స్‌లో భారత్ తరపున ఆడాలని కల కంటున్నాడు.

ఈ నెల ఉదయతారకు చందమామ శుభాకాంక్షలు తెలుపుతోంది.



అభిరుచులు:

- టర్బుకు ఎలక్ట్రానిక్స్, ఫుట్‌బాల్, వాటర్ పోలో అంటే చాలా ఇష్టం!

సాధించిన విజయాలు:

- కలకత్తా, పుణేలలో స్కూల్ నేషనల్ ఛాంపియన్‌షిప్‌లలో స్వర్ణ, రజత పతకాలు
- బెంగళూరులో జరిగిన సబ్ జూనియర్ నేషనల్ అక్వాటిక్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో స్వర్ణ పతకం
- అమృత్‌సర్‌లో జరిగిన జూనియర్ నేషనల్ అక్వాటిక్ ఛాంపియన్‌షిప్ (50 మీటర్లు, 200మీ. బ్యాక్ స్ట్రోక్) పోటీల్లో స్వర్ణ పతకం, (100 మీ. బ్యాక్ స్ట్రోక్) రజత పతకం
- ఇస్లామాబాద్‌లో జరిగిన దక్షిణాసియా స్విమ్మింగ్ ఛాంఫియన్‌షిప్ (50 మీ. బ్యాక్ స్ట్రోక్)లో రజతపతకం
- ఖతార్‌లో జరిగిన జిమ్నాసియాడ్‌లో భారత్ తరపున ప్రాతినిధ్యం.



# నవ్వుల పువ్వులు



రోహన్: నీవు వెయ్యి రూపాయలకు చెక్ రాశావు కాని దానిపై సంతకం చేయలేదు.

మోహన్: మా చెల్లి పుట్టినరోజు కోసం చెక్‌రాశాను. అయితే చెక్కు ఎవరు పంపారో తనకు తెలియకూడదని సంతకం చేయలేదు.



జడ్జి: నువ్వు మళ్లీ వచ్చావు. చెడు సహవాసం ఎటు దారి తీస్తుందో నీకు బోధపడింది కదూ!

ఖైదీ: అయ్యా, నాది చెడు సహవాసం ఎలా అవుతుంది? నేను పోలీసులను, న్యాయమూర్తులను మాత్రమే చూశాను.



నీలూ: తోకలు ఎక్కడ పెరుగుతాయి?

కమల్: జంతువుల్లో కదా

నీలూ: కానీ రచయితల తలల్లో కొమ్ములు పుడుతాయని మా టీచర్ చెప్పింది మరి! విచిత్ర జీవులు కదా!



ఆడపులి: కూనా, ఏం చేస్తున్నావే?

పులిపిల్ల: చెట్టు చుట్టూ గిరికీలు కొడుతున్న మనిషిని నేను తరుముతున్నా.!

ఆడపులి: నీ ఆహారంతో ఆడుకోవద్దని నీకెన్ని సార్లు చెప్పానే పిల్లదానా!

## అల్లరి దత్తు











హాస్యకథ

# పొరుగింటి వింత

నాన్నకు షోలాపూర్‌కు బదిలీ కావడంతో బాలు పట్టరాని సంతోషంతో తలమునకలయ్యాడు. అక్కడ రోజీ, జమాల్‌లను కలిసినప్పటినుంచి ప్రతిరోజూ పలు విషయాల గురించి వారితో పంచుకున్నాడు.

పాఠశాలకు వెళ్ళిన తొలిరోజే, అతడు సిగ్గుపడటమే కాక కాస్త ఇబ్బంది పడ్డాడు. ముఖ్యంగా రోజీ తనకేసి చేయి ఊపినప్పుడు బాగా సిగ్గు పడ్డాడు. ఆమె అతడికి జమాల్‌ని పరిచయం చేసి తమ బృందంలో చేరమని ఆహ్వానించింది. అప్పటినుంచి బాలుకి జమాల్, రోజీలతో స్నేహబంధం బలపడింది. రోజీతో తప్ప మరెవరితోనూ బాలు సన్నిహితంగా ఉండేవాడు కాడు. స్కూల్ ముగిశాక, బాలు వారితో కలిసి వారు చెప్పే కథలు వింటూ ఇంటికెళ్లేవాడు.

ఒకరోజు వాళ్లు ఒక ఇంటివద్దకు వచ్చేసరికి, రోసీ గుసగుసలాడింది. ''ఇక్కడ ఎవరు నివసిస్తున్నారో తెలుసా నీకు?'' అన్నది.

''తెలీదు.'' అని చెప్పాడు బాలు.

''ఇది కేశవ సర్ ఇల్లు! జమాల్, మనం ఈ విషయం గురించి బాలుకు చెప్పకపోవడమేమిటి? '' అడిగింది రోజీ.

జమాల్ భుజాలు తడుముకుని అన్నాడు. ''ఇప్పుడు చెప్పు మరి'' సమాధానంగా ''బాలు, ఈ దారింటా వెళ్లి, కేశవ సర్ తోట చూద్దాం మరి. అక్కడ నీకు ఒక దృశ్యం చూపిస్తాను.'' అంది రోజీ.



''మనం ఈ దారంటా వెళదామా?'' అడిగాడు బాలు. ముళ్లపొదలను తోసుకుంటూ పోతున్నారు వారు.

నడుస్తూ, కంచె ఉన్న చోటికి వచ్చారు వారు. రోజీ గుంత తవ్వినట్లున్న చోటును చూపించింది. ''ఆదివారం సాయంత్రం వేళ కేశవ సర్ ఏం చేసేవారో నువ్వు అసలు ఊహించలేవు'' చెప్పింది రోజీ. ''ఆయన ఇక్కడికి వచ్చి పారతో గుంత తవ్వేవారు.'' చెప్పాడు జమాల్.

‘‘దేనికి?’’ అడిగాడు బాలు.

‘‘బహుశా, ఆయన ఏదో నిధికోసం గాలిస్తూ ఉండి ఉంటారు’’ అన్నది రోజీ. ‘‘అది పెద్దరహస్యం బాలూ, ఎవ్వరికీ ఈ విషయం చెప్ప వద్దు.’’ అని హెచ్చరించాడు జమాల్. మరోవైపుకు వారు వెళ్ళగానే, తోటలో ఓ బంతి నిలుచున్న చోట బాలు ఆగాడు. అక్కడున్న తలుపు తెరవడానికి అతడు ప్రయ



త్నించగా అది విరిగి పోయింది. జమాల్, రోజీ ఇద్దరూ అతడికేసి తీక్షణంగా చూశారు.

‘‘నీవేం చేస్తున్నావో తెలుసా’’ కసిరాడు జమాల్. ‘‘బంతిని తీసుకు రావాలను కుంటున్నాను’’ అన్నాడు బాలు. ‘‘అయితే ఇంటిలోపలి మహిళ నిన్ను చూసే ప్రమాదముంది.’’ అని హెచ్చరించింది రోజీ. ‘‘మరి మీరెప్పుడూ ఈ విషయం నాకు చెప్పలేదే?’’ అడ్డుకున్నాడు బాలు.

‘‘ఇంట్లో ఓ మహిళ ఉంది. ఆమె కాస్త పిచ్చిది, తన ఇంటిముందు నిలబడే ఎవరిన యినా సరే ఆమె లోపలకి లాక్కుంటుంది! తర్వాత వారితో ఆమె చిత్రవిచిత్రంగా మాట్లా డుతుంది,’’ మాటకలిపాడు జమాల్.

‘‘ఏమని?’’ ప్రశ్నించాడు బాలు.

‘‘ఆమె అడుగుతుంది, నీవెవరు అనడా నికి బదులుగా ఎవర్రా నువ్వు అంటుంది. నువ్వు కూడా అలాగే మాట్లాడాలి. లేకుంటే ఆమెకు పిచ్చికోపం వచ్చేస్తుంది?’’ అన్నది రోజీ. ‘‘ఆమె ముఖానికి తొడుగు కూడా ధరిస్తుంది. ముందు మనం ఇక్కడినుంచి బయటపడదాంరండి.’’అన్నాడు జమాల్.

‘‘ఇలాంటి విషయాలు మీకెలా తెలుసు?’’ అడిగాడు బాలు. ‘‘మరి మేం సంవత్సరా లుగా ఇక్కడుంటున్నాంగా!’’ రోజీ సగ ర్వంగా తల పైకెత్తి చెప్పింది.

మరుసటి దినం, కేశవ సర్ కేసి బాలు మరింత పరీక్షగా చూసాడు. పురావస్తు ప్రాంతాలగురించి ఆయన చర్చించుకుంటు న్నాడు.

‘‘పురాతనకాలం నాటి అరుదైన వస్తు వులకోసం శోధించడం కంటే ఆసక్తి గొలిపే విషయం ఏముంది మరి,’’ చెప్పారు గురు వుగారు. బాలు తన స్నేహితులకేసి విజయ సూచకంగా చూశాడు.

అతడు అక్కడే దాగి ఉండి కేశవ్ సర్ ఏం చేస్తారో చూడాలనుకున్నాడు. కొత్తదనం కోసం తర్వాత ఈ విషయాన్ని తన మిత్రు

లతో చెప్పవచ్చు. బాలు తన పథకాన్ని బాగా మెచ్చుకున్నాడు.

కాబట్టి ఆదివారం మధ్యాహ్నం తర్వాత బాలు తన సాహసకృత్యానికి పూనుకున్నాడు. ఇంటి వెనుక వైపుకు రహస్యంగా చేరుకుంటుండగా, ఒక చెట్టు చాటునుంచి ఇద్దరు అతడిని పరిశీలిస్తున్నారు. వాళ్లెవరంటే రోజీ, జమాల్. ''చూశావా, నేను చెప్పలేదూ? నేనూహించినట్లే బాలు ఇక్కడున్నాడు.'' అన్నది రోజీ. ''మనం చాలా దూరం పోతున్నామేమో.. అతడు సులువుగా నమ్మేస్తాడు.'' అన్నాడు జమాల్. ''విను, మనం ఇంకా కాస్సేపు చూస్తూ ఉందాం, తర్వాత మనం ఊరికే కథ చెప్పామని చెబుదాం. తమాషాగా ఉంటుంది కదూ...'' అని పరాచకాలాడింది రోజీ.

''బాలు అక్కడే చాలాసేపు వేచి ఉన్నాడు కాని అతడికి తోటలో తవ్వుతున్న కేశవ సర్ కనబడలేదు. ఉన్నట్లుండి, శబ్దం వినబడి వెనక్కు తిరిగాడు. ముళ్ల పొదలోంచి ఏదో అతడి ప్యాంట్‌ను పట్టి లాగుతోంది. లాగింది ఆ మహిళే. ''దయ చేసి నన్ను వెళ్లనివ్వు'' ప్రాధేయపడ్డాడు బాలు.

''నన్ను వదిలివేయి. దయచేసి వదిలిపెట్టు'' బాలు అడుక్కోవడం ప్రారంభించాడు. ఆ మహిళ అతడికేసి ఉన్నట్లుండి పక్కున నవ్వింది.'' నీ చొక్కామీద పెద్ద రంధ్రం ఉంది. లోపలకు రా, నీ చొక్కాను కుట్టిస్తాను'' దాంతో బాలు ఆమెతో పాటు ఇంట్లోకి వెళ్లాడు. ''ఇప్పుడు చెప్పు, ఈ ఆటంతా దేనికి? అడిగిందామె సూటిగా చూస్తూ.'' బాలు ఇంట్లోకి వెళ్లి చాలా సేపు అయింది. రోజీ, జమాల్ బయటే ఉండి ప్రతిదీ గమనిస్తున్నారు. ఆత్రుత పట్టలేక వారు గేటు బయటికి వచ్చి చూడసాగారు. ''ఇంట్లోంచి బయటకు వచ్చేసరికి తను పిచ్చివాడవుతాడు చూడు.'' అంది రోజీ.

అయితే బాలు అరగంట తర్వాత బయటకు వచ్చాడు. రోజీ, జమాల్‌లను చూడగానే చేతులూపాడు. ''ఏంజరిగిందో తెలుసా, ఆ మహిళ చాలా మంచిది. నేను తనతో మొత్తం చెప్పేశాను. చెబుతున్నంతసేపూ ఆమె నవ్వుతూ చప్పట్లు కొట్టింది. తన పత్రికలో ఈ కథ మొత్తాన్ని నా పేరుతో ప్రచురిస్తానని చెప్పింది కూడా,'' రోజీ, జమాల్ సిగ్గుపడ్డారు. – రమా రమేష్






# దాగిఉన్న చాకో కనుక్కోండి!

ఏయ్ పిల్లలూ! మీరు చాకోని పట్టుకునేందుకు సిద్ధమా? ఈ డ్రాయింగ్‌లో దాగిఉన్న అన్ని 15 ట్రీట్ చాకో ప్యాక్‌లనీ, బిస్కట్లనీ కనిపెట్టండి. జాగ్రత్తగా చూడండి. ఒక్కటి కూడా మిస్ కాకండి! మరి, ఆన్ యువర్ మార్క్స్, గెట్ సెట్, గో! చాకో యే తీసేసుకొంటాం!

